# టెన్‌సింగ్ నార్కే




ఉభయభాషాప్రవీణ

చింతలపూడి శేషగిరిరావు, బి. ఎ.,

ప్రధానాంధ్ర పండితుఁడు, బోర్డుహైస్కూలు, నిడుబ్రోలు.

సంస్కృతి ప్రచురణ

(46)

4

సంస్కృతి ప్రచురణ-46

వెల రూ॥ 0-15-0

ప్రథమ ముద్రణ

1-11-1953

ప్రకాశకులు :

కల్చరల్ బుక్స్ లిమిటెడ్,

31, మీరాన్ సాహెబ్ వీధి,

మౌంట్ రోడ్డు :: మద్రాసు-2.

ముద్రాపకులు :

స్వతంత్ర ప్రెస్,

31, మీరాన్ సాహెబ్ వీధి,

మౌంట్ రోడ్డు :: మద్రాసు-2.

5

28.8.54

# విషయానుక్రమము

పుట

## పూర్వఖండము



## ఉత్తరఖండము

# 1

# ఉపక్రమణిక

భరతఖండమునకు నుత్తరపుటెల్ల హిమాలయము లని తెలిసి యుంటిరి కదా! ఈ పర్వతపంక్తి సుమారైదు మైళ్లయెత్తును, బదునైదువందలమైళ్లనిడివిని గలిగి ప్రపంచము లోనికెల్ల నత్యున్నతమని ప్రసిద్ధి గాంచినది. ఈ పర్వత రాజమే గంగ, సింధు, బ్రహ్మపుత్ర, మున్నగు పావన నదీమ తల్లులకు బుట్టినిల్లు. ఇందు ఎవరెస్టు, కాంచనగంగ, ధవళగిరి, నందదేవి, గౌరీశంకరము, మున్నగు శృంగము లెన్నియో కలవు. ఈ కొండకొమ్ములు సర్వదా స్వచ్ఛమగు హిమముచేఁ గప్పఁ బడుట వలన నీ గిరికి రజతగిరి యను నామము సార్థక మయ్యెను.

పర్వతపంక్తులు దేశమునకు బహువిధముల నుపక రించును. దుర్గములై పెట్టనికోటలవలె నుండి దేశమును శత్రుబారి నుండి కాపాడును. దేశమునకు సరిహద్దులుగ నుపయోగపడును. వివిధతరులతాగుల్మాదుల విరాజిలి నేత్ర పర్వమగు ప్రకృతిరామణీయకమును బెంపొందించును. కృష్యాదికర్మములకును, రాకపోకలకు నుపయుక్తములగు దివ్యస్రవంతుల నెన్నటినో యుద్భవింపఁ జేయును. అమూల్య ములగు నోషధుల కాకరముగ నుండును. ఋతుపవనముల నడ్డి వర్షప్రదాన మొనర్చును. మీఁదుమిక్కిలి పర్వతప్రాంత

శీతోష్ణస్థితి మానవుని శరీరారోగ్యమును వృద్ధి సేయుటకు మిగుల ననువుగ నుండును. కావుననే హిమాలయములందుఁ బ్రభుత్వమువారికి సిమ్లా, డార్జిలింగు, నైనిటాలు, ముస్సోరి, మున్నగు నగరరాజములు వేసవివిడుదులుగను, నారోగ్యాశ్రమములుగను నుపకరించుచున్నవి. అట్టి యారోగ్య కేంద్రము మన దక్షిణహిందూస్థానమున గూడ నొండు గలదు. నీలగిరులందలి యుదకమండల మట్టిదియే. అంతదూరము పోనేల? మన దేశమందలి పవిత్రపుణ్యక్షేత్రములఁ గొన్నిటి నారయుఁడు. పర్వతశిఖరాగ్రములందే కలవుగదా! తిరుపతి, శ్రీశైలము, మున్నగు పుణ్యక్షేత్రములు తైర్థికుల నెందఱినో యాకర్షించి యారోగ్యదాన మొనర్చుట లేదా?

పూర్వోక్తమగు గౌరీశంకరశృంగము పురాణదంపతులగు గౌరీశంకరుల నివాసస్థాన మనియు, నద్దియే కైలాస మనియు మనశాస్త్రప్రసిద్ధి. దాని నెగువభాగముననే పాశ్చాత్యులు 'ఎవరెస్టు' అని పిలుచు మఱియొక శృంగము కలదు. ఇయ్యది ప్రపంచమందలి పర్వతశిఖరము లన్నిటికంటె మిక్కిలి యున్నత మైనది. ఇది 29,141 అడుగుల యౌన్నత్యమున శంక్వాకారముగ గన్పట్టును. వందమైళ్ల దూరము వఱకు చూపఱుల దృష్టి నాకర్షించి యత్యాశ్చర్యము గొల్పుచుండును.

భారతీయు లాధ్యాత్మికవిషయముల కెట్టి ప్రాముఖ్యము నిత్తురో పాశ్చాత్యులు భౌతికవిషయముల కట్టి ప్రాధాన్య

మొనఁగుదురు. పాశ్చాత్యులకు, ప్రాచ్యులకు గల తారతమ్య మిద్దియే. భౌతికవిషయపరిశోధనకై శ్వేతముఖులు ధనమాన ప్రాణములనైన త్యజించి మిగుల సాహసము చూపుదురు. పాశ్చాత్యు లిట్టి సాహసకృత్యము లెన్నియో యొనరించిరి. అందు బెక్కురు దమ ప్రాణములఁ దృణప్రాయముగ నెంచి యీ యన్వేషణకృత్యమున నసువుల బాసిరి. అట్లయ్యు నితరు లట్టి జతనముల విరమింపరైరి. ప్రారబ్ధకార్యమధ్యమున నెట్టి యాటంకము లొదవినను, నెట్టి యాపదలు వాటిల్లినను బట్టిన పట్టు విడువక ప్రాణము లొడ్డియైన తుదకు విజయము గాంతురు.

పాశ్చాత్యులు నవీనప్రపంచమనబరగు నమెరికా ఖండ మును గనుఁగొనిరి. చీఁకటి ఖండమగు నాఫ్రికాను బరిశో ధించిరి. అందావఱకు మానవుఁడు కనివిని యెఱుఁగని పెక్కు నదులను, సరస్సులను వెలుగునకుఁ గొనివచ్చిరి. సంతత హిమావృతములై మనుజుఁడు కాలిడ రాని యుత్తర, దక్షిణ ధ్రువముల నన్వేషించి కృతకృత్యులైరి. గంభీరములగు మహాసముద్రముల లోతులను గనుఁగొనిరి.

అట్లే యజేయమగు నెవరెస్టును జయింప జిరకాలము నుండి బహుళప్రయత్న మొనర్చు చుండిరి. పెక్కుసారులు పెక్కుజట్లు ప్రయత్నించి విఫలమనోరథము లయ్యెను. అట్టి జట్టులందు ఘూర్కాలు, నేపాలీయులు మున్నగు మన భార తీయులు గూడఁ బాల్గొను చుండిరి. యత్నించినపుడెల్ల

నొక్కొకమెట్టు పై కెగబ్రాకఁ గల్గి కొంతకొంత కృతకృత్యు లగుచు వచ్చిరి.

పర్వతారోహణ మనిన సామాన్యవిషయము గాదు. మిగుల సాహసోపేతము. మిక్కిలి దుస్సాధము. అపాయ భూయిష్ఠము. సముద్రమట్టమున గాలియొత్తిడిశక్తి ముప్పది యంగుళము లుండును. కాని పైకిఁ బోయిన కొలది యది మిగులఁ బలుచఁబడును. 15,000 అడుగుల యెత్తునకుఁ బోయిన పిమ్మట గాలియే కఱవై, మానవుఁ డూపిరిఁ బీల్చుటయే కష్టతరమగును. అందువలననే పర్వతారోహకులు పైకిఁ బోవునపుడు ప్రాణవాయుపూరితగోళముల వెంటఁ గొంపోవుదురు. కాని 'తాను దూర కంత లేదు, మెడ కొక డోలు' అన్నట్లూరక పోవుటయే కష్టమగుచుండ నెంతదనుక నీ బరువు మోయుట? నిట్రమగు పర్వతమును ప్రాకునపుడు ఘనీభవించిన మంచుపైఁ గాలు జారెనా నదః పాతాళము నకుఁ బోయి 'హరీ' యనవలసినదే. మధ్యేమార్గమున మంచుతుపానులు రేగెనా సర్వావయవములు కొంగరులు వోయి మానవుఁడు కొయ్యబారి నీల్గవలసినదే. మధ్యమధ్య హిమానీనదములఁ జిక్కుకొనెనా వానియురవడి కోర్వఁ జాలక ప్రవాహము వెంటఁ బడి పర్వతపాదమును జేర వలసినదే.

అయిన నిట్టి ప్రాణోపద్రవకరమగు ప్రయత్నము పర్వతారోహకు లేల సలుప వలెను? ఇందులకు వారి సత్యా

న్వేషణతత్పరతయే కారణము. ఎట్లుండునో చూత మను నుబలాటమే యూఁత. మున్ముందుగఁ దాను కాలిడ గలిగితి నన్న ప్రతిష్ఠ నార్జించ వలెనను నాశయే తోడు. ప్రకృతి శక్తినిఁ బరాజిత మొనర్పవలె నను పట్టుదలయే యాలంబము.

ఇట్లు ప్రేరేపింపఁబడి 1921లో నొక జట్టును, 1924లో మఱియొక జట్టును, 1933లో నింకొక జట్టును ఎవరెస్టు శిఖరారోహణ యత్న మొనరించిరి. కాని ప్రకృతిప్రాబల్యముముందు తమ శక్తిసామర్థ్యములు వీటిఁబోవ విఫలమనోరథులై వెనుదిరిగిరి. 1936లో విమానయానమున మాత్ర మీ శిఖరమును కొందఱు గాంచఁగల్గిరి. కాని కాలినడక నా శిఖరమును జేరినవారు లేరు. అట్లు పాదచారియై యీ పర్వతాగ్రమును దర్శించుటలో, మెట్టుటలో, పతాకప్రతిష్ఠాపన మొనర్చుటలో నగ్రతాంబూలము మన భారతీయునకే దక్కినది. ఆ సాహసిక శిఖామణియే మన టెన్ సింగు. ఆతఁడే మన మంచుపులి. ఇట్లెవరెస్టును జయించిన మన టెన్ సింగు జట్టులో హంటు, హిల్లరీ మున్నగు పాశ్చాత్యులు కొందఱు గలరు. ఈ దళనాయకుఁడగు హంటు బ్రిటిషువాఁడు. ఈ దళమునకు బ్రిటిష్ యాత్రాదళ మని పేరు వచ్చెను.



# 2

# ఎవరెస్టు పుట్టుపూర్వోత్తరాలు

తొల్లి మనభూగోళము నిప్పులు గ్రక్కు నొక యగ్ని గోళము. కాలక్రమమున నది చల్లారి చల్లారి కొన్నాళ్లకు వాసయోగ్య మయ్యెను. మృదువగు వేడివస్తువు చల్లారి నపుడు ముడుతలు పడుట సహజము. అట్లేర్పడిన ముడుతలే పర్వతపంక్తులు. ఈ పరివర్తనమున నచలము లగాధసముద్రములుగను, ఉదధు లుత్తుంగపర్వతములుగను మారును. అది కారణముగ మనహిమాలయప్రాంతము పూర్వమొక మహాసముద్రము. అందుండి భూమి పైకుబికి, కాలక్రమాభివృద్ధి గాంచి, 'ఇంతింతై వటుఁ డింతయై' యన్నట్లిప్పటి యుచ్ఛస్థితిఁ గాంచినది. ఇది భూగర్భశాస్త్రజ్ఞుల దృఢాభిప్రాయము.

అసలు ఎవరెస్టు విజయయాత్ర రెండు శతాబ్దముల క్రిందటనే ప్రారంభ మయ్యెను. 1711లోనే ఫ్రెంచి జెసూటు ఫాదరీలు హిమాలయములను సర్వే జేయు పద్ధతిని చైనీసు లామాలకు శిక్షణ నిచ్చిరి. చైనీసుప్రభుత్వము దీని కంగీకరించెను. దక్షిణపు టెల్లతోఁగూడ 40 మైళ్ల హిమాలయ ప్రాంతపుబటము 1735 లో సిద్ధపఱుపఁ బడెను.

1848లో ఇండియా సర్వేశాఖకు జెందినజట్టీ యత్యున్నత శిఖరమును గుర్తించెను. ప్రపంచమందలి శిఖరము లన్నిటికన్న నిదియే యెత్తైనదని కనుఁగొనిరి. ఇందు

సభ్యుఁడైన రాధానాథ సిక్దా రిదియే యత్యున్నతమైన శిఖర మని నిర్ణయించెను. దీని కప్పుడు '15' వ శిఖరమని పేరు పెట్టఁబడెను. 'చౌమా లాంగ్మా' యను టిబెటు పేరు మొత్తము హిమాలయపర్వతపంక్తికే చెల్లును. గౌరీశంకర మనుపేరు దీనికి 5,000 అడుగుల క్రిందనున్న మఱియొక శిఖరమునకు గలదు. ఈ '15' వ శిఖరమునకు 'ఎవరెస్టు'అని యేల నామకరణ మొనర్చిరో యూరయుఁడు.

తరువాత హిమాలయా ప్రాంతములను సర్వే యొనర్చిన 'జియాగ్రాఫికల్ సర్వే ఆఫ్ ఇండియా' శాఖకు సర్ జార్జి యెవరెస్టధ్యక్షుఁడు. ఆయన దీని యౌన్నత్యము 29,141 అడుగు లుండునని 100 మైళ్ల దూరమునుండి యంచెనా వేసి కనుఁగొనెను. కాని దానిని సమీపించుటకు సాహసింపఁ డయ్యెను. ఏదియెట్లున్నను నాయన పేరటనే దీని కీనామము సిద్ధించెను. ఇట్లు దవ్వు దవ్వులనుండి సర్వే యొనర్చుటయే కాని సమీపింప నేరికిని 'దమ్ము'లు లేవయ్యెను. దీని కొక ప్రధాన కారణము గలదు.

హిమాలయములు స్వతంత్రరాష్ట్రములగు నేపాలు, టిబెటు లందు వ్యాపించి యున్నవి. కాన నెవ రెంత సాహసించి సన్నద్ధులైనను, ప్రాణములకుఁ దెగించి యారోహణకు బూనినను, పై ప్రభుత్వము లారులను దమ ప్రాంతములందు బాద విన్యాస మొనర్పనీవు. 'దేవుఁడు వరమిచ్చినను బూజారి వరమీయఁ' డనుట యిట్టిదే కదా!

తొలుత బెంగాలు, పంజాబు ప్రభుత్వము లీ పర్వత పర్యవేక్షణార్థము పరిశోధకుల నియమించిరి. వారు టిబెట్టు, నేపాలుల యనుజ్ఞ వడయ లేక గూఢచారులఁ బంప వలసి వచ్చెను. అట్టి వారియందు హరిరా మను నతఁడు ముఖ్యుఁడు. అతఁడు 1871లో వైజ్ఞవేషమున నా రాష్ట్రము లం దడుగిడి, నైద్యమూలమున గొంత పలుకుఁబడి నార్జించెను. కొంత వఱకు బరిశోధన యొనర్చి కొన్ని నూతనాంశముల నరయఁ జాలెను. 1889లో మఱియొక శిక్కు పరిశోధకుఁడు హిమాలయ ప్రాంతమున కేగి పర్యవేక్షణ సాగించెను. కాని యాతని పరిశోధనల వలన బయల్పడిన నూతనవిషయము లెవ్వియు లేవు.

మొదట పరిశోధన జరిపిన హరిరామే మరల నొక మాఱు బయలుదేరి, పెక్కు కష్టనష్టములకులోనై మఱి కొన్ని నూత్నవిషయముల సేకరింపఁగల్గెను. తదాది 1903 వఱకు బరిశోధనాకార్య మొక్క యంగుళ మైనను ముందునకు సాగక 'యెక్కడ నుంటివే గొంగళీ యన, వేసిన చోటనే యుంటి' నన్న ట్లుండెను. ఆ సంవత్సరమున కెప్టెన్ రైడరు కొంత పర్యవేక్షణ సాగించి, క్రొత్తవిషయములఁ గొన్నిటిని వెలుగునకుఁ గొనివచ్చెను. 1913లో జే.బి. నోయ లను పరిశోధకుఁడు ఎవరెస్టున కాగ్నేయప్రాంతమున గొంత పరీక్ష యొనరించెను. అప్పటినుండి 1921 వఱకు బరిశోధనా కార్యము కొంత మందగించెను. కాని తదాది కేవల పరిశోధనమాత్రమే కాక సక్రమారోహణకు సన్నాహములు

జరుగుచుండెను. పెక్కు రారోహకులు భగీరథప్రయత్నము నొనర్చి విఫలమనోరథులై నడుమనే విరమింప వలసిన వారగు చుండిరి.





# 3

# ప్రథమ ప్రయత్నము

ఇంగ్లాండు దేశమున 'రాయల్ జాగ్రాఫికల్ సొసైటీ' యను నొక సంస్థ గలదు. నూతనఖండములఁ గనిపెట్టుట, నవీనారణ్యముల నాణ్య మెఱుంగుట, నవద్వీపముల నారయుట, క్రొంగ్రొత్త నదీముఖద్వారముల నన్వేషించుట, మున్నగున వీ సంఘకర్తవ్యములు. ఆ దేశముననే 'ఆల్పైన్ క్లబ్' అను మఱియొక సమితికలదు. ఇందలి సభ్యులందఱు నగారోహణకృత్యములం దందెవేసిన చేతులే. ప్రపంచ మందలి పర్వతశిఖరముల నన్నిటిఁ బరాజిత మొనర్చుటయే యీ సమితి ప్రధానాశయము.

కతిపయకాలమునకు, సర్వభూగోళపరిజ్ఞానము, సత్యాన్వేషణము పరమాశయములుగఁ గల నీ రెండు సంఘములు మిళితమై 'ఎవరెస్టు సమితి' యను నొక నూతనసంస్థ స్థాపిత మయ్యెను. పరిశోధనానుభవము గల ఫ్రాన్సిస్ యంగ్ హజ్బెండ్ ఈ నూతన సంఘమున కధ్యక్షుఁడు. ఈ సరి క్రొత్త సంఘయాజమాన్యముననే ఎవరెస్టును ఆరోహింప నిశ్చయింపఁ బడెను. సమితిసభ్యులు సర్వసన్నాహము లొనర్చిరి.

ప్రథమ దళమునకు ప్రజ్ఞానిధులగు సభ్యు లెన్నుకొనఁ బడిరి. అందు హావర్డుబ్యూరీ యను నతఁ డగ్రగామి. రిమే

బరన్, కెల్లాను, మేలరి, బుల్లకులు నగారోహకులు. వీలరు, మార్షీదులు ప్లానుతయారుచేయువారు. వాల్లాస్టన్ వైద్యుఁడు. హెరాన్ భూగర్భశాస్త్రజ్ఞుఁడు.

ఇట్లు సమగ్రమై చారిత్రకప్రసిద్ధిఁ గాంచిన నీ జట్టు తొలిసారి డార్జిలింగు పట్టణము నుండి బయలుదేరెను. కాని 'జడ్డిగము లోనే మిడుతపోటు' అన్నట్లు వారి వెనువెంటనే వర్షము బయలు దేరెను. అయినను వారా వర్షములోనే 'టీస్తా' లోయ వఱకు బయనించిరి. తదుపరి జెలప్కనుమ ద్వారమున టిబెట్ ప్రవేశించిరి. పిమ్మట చుంబీనదిని దాటి ఉత్తరదిశగ బ్రయాణమొనర్చిరి. బయలుదేరుటకు మున్నె తాము బడయఁగల్గిన దలైలామా యనుజ్ఞాపత్రమును నా ప్రాంతప్రజలకు జూపిరి. అచటివారెల్ల నీ బృందము నతిగౌరవమున నాదరించిరి.

'వినాయకుని పెండ్లి కన్నియు విఘ్నములే' యన్నట్లాదళము వారందఱొక్కసారిగ జ్వరపీడితులైరి. అగుటయేకాక యందు కెల్లా ననునతఁడు మృత్యువాతఁ బడెను. తదితరు లాతని కచటనే యంత్యక్రియ లొనర్చి, ముందునకు బోసాగిరి. మధ్యమధ్య టిబెటనులు వారి కాతిధేయసత్కారము లొనర్చుచుండ, వారోపిన కొలఁది నూతనాంశముల సేకరించుచు బురోగాములగుచుండిరి.

ఇంతలో ఋతుపవనము లారంభ మయ్యెను. నదులన్నియు నుప్పొంగెను. కాని వారిట్టి యాటంకముల లెక్కఁ

గొనక నడుమ నడుమ మకాము లేర్పాటు జేసికొనుచుఁ బ్రయాణము సాగించిరి.

17,800 అడుగుల యెత్తున మొదటి శిబిరమును, దానికి రెండు వేల యడుగుల పై భాగమున రెండవ శిబిరమును నెలకొల్పిరి. 21,000 ఎత్తున మూఁడవ శిబిరమును నిర్మించిరి. దీని కనతిదూరమున నార్తుకాల్ పర్వతము కలదు. దీనిపైఁ బ్రయాణము కత్తిమీఁద సాము వంటిది. ఇది మిగుల నున్నతమై చాల నిట్రముగ నుండును. సంతతహిమావృతమై యుండును. దీనిపై 'ఎవలాంచెస్', అనగా ఘనీభవించిన మంచుగడ్డ, లుండును. ఈ హిమశిల లే నిముసమున జారి ప్రయాణీకుల ప్రాణముల బలిగొనునో చెప్ప నయితి గాదు.

ఇట్టి యపాయకర పర్వతమును సోమరునెల్, మేలరీలు, మఱికొందఱు భారవాహకులు దాటిపోఁ గల్గిరి. కాని గమ్యస్థాన మగు నెవరెస్టింకను 6,000 అడుగుల దూరమున గలదు. ఎటు జూచినను నున్నతములగు పర్వతశ్రేణులు, అగాధములగు లోయలు, దట్టముగఁ గ్రమ్మిన మేఘపంక్తులు తప్ప పచ్చని చెట్టొక్కఁడను ముచ్చటకైనఁ గాన్పింపదు. ఈ భయావహ మగు నార్తుకాలు దాటిన పిమ్మట నారోహకులు నాల్గవ శిబిరమును స్థాపించిరి. కాని మిగుల డస్సి పైకిఁ బోఁజాలక మరల మూఁడవ శిబిరమునకుఁ దిరిగివచ్చిరి.

ఏలయన, నటనుండి పర్వతము మిగుల నిట్రముగ నుంటయే కాక నెగుడు దిగుడుగ నుండెను. ఆరోహణము

పేరు దేవుఁ డెఱుఁగుఁగాని యుచ్ఛ్వాస నిశ్వాసములే మిగులఁ గష్టతరముగ నుండి యుక్కిరి బిక్కిరగుచుండెను. ప్రతి యిరువది నిముసములకును నీయారోహకులు నాలు గైదు నిముసములు విశ్రాంతి దీసికొన వలసి వచ్చెను. అట్లే వారు చీమలవలెఁ బ్రాకుచుఁ గొంత దవ్వేగిరి. ఆరోహకు లందఱు దృఢమగు మోకుతో నొకరి కొకరు బంధించుకొని మిగుల జాగరూకతతో నేగిరి. అగ్రగామి యగు మేలరీ రాఁబోవు నపాయమును గనుఁగొని, తన మంచుగొడ్డలి నట నాటి, మోకును దానికిఁ జుట్టి నిలఁబడెను. ఇట్లుపాయశాలియు, నుపజ్ఞాధురీణుఁడు, ననుభవజ్ఞుఁడు నగు మేలరీయే లేకున్న దళము వారందఱును రెండు మూఁడు వేల యడుగుల దిగువ భాగమునకు దొరలి సంఘాతమరణము పాలయ్యెడి వారే. 'పులిమీఁది పుట్ర' యను నట్లంతలో హేమంతఋతువు దాఁపుర మయ్యెను. కాన దళమువా రెవ్వరు నొక్కయడు గైన ముందున కిడఁ జాలక తిరోగమింప వలసిన వారైరి. ఈ యత్నమున మార్గ్షిదు చేతిప్రేళ్లు మంచుదిని పోయి 'యుండునా యూడునా' యను సందేహ మావహిల్లెను.

— ♦ —

# 4

# ద్వితీయ యత్నము

ధీరులు ప్రజ్ఞానిధులు గానఁ బ్రారబ్ధకార్యములు మానరు. తొలిజట్టు విఫలమనోరథులైరి కదా యని మలి జట్టు మానలేదు. మఱియొక దళము ద్విగుణీకృతోత్సాహముతో బయలు వెడలెను. ఈసారి జఫ్రే, బ్రూస్, జార్జి ఫించ్, డాక్టరు వేకుఫీల్డు, నోయలు, తేజవీరను ఘూర్ఖావీరుఁడును బయల్వెడలిరి. ఇందు ఫించ్ ఆరోహణసమయమున బ్రాణవాయువు మిగుల నుపకరించునను దృఢనమ్మకముగల శాస్త్రజ్ఞుఁడు. నోయలు చలనచిత్రగ్రాహకుఁడు.

వీరు కొన్ని పయనము లొనర్చి యపాయకరమగు నార్తకాలు మకామును దాటిరి. అప్పటికే కొంత మంది భారవాహకులు మున్నగువారి నా మకామున వదల వలసి వచ్చెను. ఫించ్, బ్రూస్, తేజవీరులు మాత్రము పైకిఁ బోవ సమకట్టిరి. 26,000 అడుగుల యెత్తున నొక పటకుటీరము నిర్మింప వలెనని వారి యాశయము. హిమపాతము ప్రారంభ మయ్యెను. హోరుగాలి భళ్ళున వీచుచుండెను. ప్రకృతి భయంకరాకారము దాల్చి విజృంభింప సాగెను. అప్పటి కారోహకులు 25,500 అడుగుల యెత్తున నుండిరి. నిరపాయముగఁ దలఁదాచుకొనుటకు వారచట నొకగుడారము నతికష్టము మీఁద నిర్మింపఁ గలిగిరి.

కాని యీ శిబిరము మంచుపై నిర్మింపఁ బడుటచేఁ బెనుగాలి యూపునకుఁ గ్రక్కదలుచుండెను. ఝంఝా మారుతము కతమున నా గుడార మెప్పు డువ్వెత్తుగఁ బెకలింపఁ బడునో యని వారఱచేతఁ బ్రాణములఁ బట్టుకొని యుండిరి. 'గోరుచుట్టుపై ఱోకటి పోటు' న్నట్లింతలో నిశీథ మయ్యెను. హిమవృష్టి యెక్కుడయ్యెను. కన్ను పొడిచికొనిను గన్పడని యీ చిమ్మచీఁకటి లోనే వారు మధ్యమధ్య బయటికి వచ్చి గుడారము త్రాళ్లు బిగించు చుండిరి. ఆరాత్రి యెట్లో వారు వేగించిరి. భళ్లునఁ దెల్లవారెను. హిమవృష్టి వెనుకాడెను. కాని ప్రచండవాయు వట్లే వీచుచుండెను. 'ముందుగొయ్యి వెనుకనుయ్యి' యను నట్లు వారు ముందునకు గాని, వెనుకకు గాని కాలిడ వీలు లేకుండెను. ఉన్న చోటనే కదలక మెదల కుండుట క్షేమకరమని వారు తలఁచిరి. కాని తనపైఁ గత్తి కట్టిన ప్రతికక్షులను బ్రకృతి పైపైఁ బోనిచ్చునా? ప్రచండ మారుతప్రభావమున నొక పెనుబండ పైనుండి దొరలి గుడారమునఁ బ్రవేశించెను. అదృష్టవశాత్తు నపాయ మేరికిని గలుగ దయ్యెను.

ఆ ముప్వురారోహకు లివ్విధమున నింతదనుకఁ బ్రకృతితో హోరాహోరిఁ బోరుచునే యుండిరి. మఱియొకరైన నిట్టి తరుణమున వెన్నుఁజూపి యుందురు గాని ఫించి, బ్రూస్, తేజవీరు లట్టివారు గారు. అచంచల ధీరులు. వారి మొండి ధైర్య మేమో కాని యించుకయుఁ జలింపక, మఱునాడైనఁ

ప్రకృతి కనికరింపదా యను నడియాసతో నట్లే ప్రాణములు గుప్పిటఁ బట్టుకొని యుండిరి. వా రనుకొనినట్లే మరుసటి దినమున ప్రకృతి విజృంభణ కొంత తగ్గినది. ఇంతలోఁ క్రింది శిబిరమునుండి వారికి తేనీటి పానీయము కూడ నందింపఁబడెను.

మఱునాటి వేకువను మరల నారోహణ సాగించిరి. కాని మంచు పేరుకొనుటచేఁ బాదరక్షలు బరువయ్యెను. ప్రాణవాయు సాధనములు, ఫ్లాస్కులు మున్నగు సజ్జాసరజాములు వీనికిఁ దోడయ్యెను. అది కారణముగ నడక సాగదయ్యెను. అడుగులో నడుగు బెట్టుకొనుచు వారట్లే 26,000 అడుగుల యెత్తును గమించిరి. అంతట దేజవీరు మెత్తఁబడి ముందంజ వేయలేక పోయెను. కాని ఫించ్, బ్రూసు లిరువురు పురోగమించుచునే యుండిరి. వారెంతో కష్టము మీఁద మఱి 500 అడుగుల దవ్వు పై కెగఁబ్రాకఁ గల్గిరి.

కాని ప్రకృతి భయంకరాకారమున మరల విజృంభింప సాగెను. పరిస్థితు లన్నియుఁ బ్రతికూలముగఁ బరిణమించెను. శీతుబాధ మిక్కుటమయ్యెను. వాయువు ప్రచండతరమై యొక్క యడుగైన ముందునకు సాగనీక వెనుకకుఁ బడనెట్టు చుండెను. మార్గమా నిట్రము. పొడిమంచా బలముల నాచ్ఛాదించి మోసగించు చుండెను. పొగమంచు దృష్టి కవరోధము గల్గించుచుండెను. అట్లే ఫించ్, బ్రూసు లిద్దరు 27,000 అడుగుల యెత్తును జేరఁ గల్గిరి. కాని

వీరెంత దల క్రిందుగఁ దపమాచరించినను నెవరెస్టు మాత్రము లొంగునట్లు కన్పడ దయ్యెను. ప్రకృతి ప్రాబల్యము ముందు మానవబల మెంత? హస్తిమశకాంతరము గదా!

ఎవరెస్టింకను నరమైలు దూరమున గలదు. ఇది యిట్లుండ 'శ్రేయాంసి బహువిఘ్నాని' యన్నట్లు బ్రూస్ ప్రాణవాయు పరికరము శిథిలమై, పనికిమాలిన దయ్యెను. కాని శాస్త్రజ్ఞుఁడగు ఫించ్ దాని నచిరకాలమున బాగు పఱచి యపాయసమయమున నాదుకొనెను. అంతట వారిరువురు మరలఁ బురోగమనము సాగించిరి. ఇంకొక 235 అడుగులు మాత్రము పైకిఁ బోఁగల్గిరి. అప్పటికి వారి జవసత్త్వ లుడిగెను. శరీరావయవములు పనిచేయవయ్యెను. అడుగు సాగదయ్యెను. పై పెచ్చు చలి యెముకలు కొఱికి వేయుచుండెను. ఇట్టి విషమపరిస్థితులందు వారు వచ్చినదారినిఁ బట్టి వెనుఁదిరుగ వలసిన వారైరి. అట్లు వచ్చుచు వారు క్రిందిశిబిరమున నాదమఱచి నిదురించుచున్న తేజవీరుని లేపుకొని, చచ్చిచెడి చేయంగల విన్నపములై, కొంపఁ జేరిరి. ఇట్లు మలిజతనము గూడ విఫలమైనది.



# 5

# తృతీయ యాత్ర

ఎట్లైన నెవరెస్టును స్వాధీన మొనర్చు కొనుటయే పర్వతారోహకుల ప్రధానలక్ష్యము. ఈ లక్ష్యసిద్ధినిఁ బొందుటకు వా రింకొకసారి బ్రహ్మాండమగు ప్రయత్న మొనర్చిరి. ఈసారి జనరల్ బ్రూసును దళనాయకునిగ నెన్నుకొనిరి. ఆతని యాజమాన్యముననే సర్వసన్నాహములు పూర్తి యయ్యెను. దళసభ్యులు నార్టన్, మేలరీ, సోమరువెల్, జఫ్రే బ్రూస్, నోయలు, బీరుహామ్, హింగ్‌స్టన్, హజార్డు, ఇర్విన్, ఓడెల్, షెబ్బియ రనువారు. ఈమాఱు కూడ దళసభ్యులు పెక్కుశాఖలుగ జీలి, యొక్కొక్క శాఖవా రొక్కొక్క విధిని నిర్వహించుటకు బూనుకొనిరి. సభ్యులందఱు దాదాపు ప్రాతవారే. హిమాలయములతో జిరపరిచయము గలవారే. పర్వతారోహకుల జట్టుకు బ్రత్యేకముగ నార్టను, మేలరీలు నాయకులు.

యథాప్రకారము జట్టువారు డార్జిలింగు నుండి బయలు దేరిరి. యాత్రికులు ప్రకృతిరామణీయకమునకు ముగ్ధులగుచు బయనము సాగించుచుండిరి. కాని వారు టిబెటు ప్రవేశించిరో లేదో యప్పుడే శీతలవాతూలము ప్రారంభమయ్యెను. అది కారణముగ జనరల్ బ్రూస్ మలేరియాకు గుఱి యయ్యెను. ఎన్నిదినముల నుండియో శిఖరమును

జయింపవలెనని యువ్విళ్లూరుచున్న బ్రూస్ హతాశుఁడయ్యెను. ఈ యవాంతరముచే మిగిలిన జట్టువారును మిగుల వంత నొందిరి. కాని వారి భల్లూకపుఁ బట్టు మాత్ర మించుకయు సడల దయ్యెను. అట్లే వారు మూలశిబిరమును జేరి యటనుండి మొదటి పటకుటీరమునకు జేరికొనిరి. వాతావరణము కొంతవఱ కనుకూలముగనే యుండెను. కొంత సేపటికి హిమవృష్టి ప్రారంభ మయ్యెను. యాత్రికులు శీతుబాధచే గడగడ వడకు చుండిరి. చలిదుస్తులు పనిసేయ వయ్యెను. ఆయాసము మెండయ్యెను. ఎట్లో వారు గుండె ఱాయి చేసికొని మొదటి రెండు శిబిరముల నతిక్రమించిరి.

ఇఁక మూఁడవ శిబిరము నిర్మించవలెను. ఈ పనికై మేలరీ, యిర్విను లును, గొంతమంది భారవాహకులును బయలుదేరిరి. కాని మధ్యేమార్గమున నాకసము మేఘావృతమై తుపాను బయల్వెడలు సూచన లగుపట్టెను. త్రోవ యంతయు నగమ్యగోచర మయ్యెను. వారొక్కొక్క మెట్టు చెక్కుకొనుచుఁ బైకిఁ బోవలసి వచ్చెను. వాయువేగ మత్యధికమై వారు వెనువెనుకకు నెట్టివేయఁ బడుచుండిరి. చలిబాధయు, నంతకంటె మిక్కుటముగ హిమవృష్టియు వారిని వేధించుచుండెను. ప్రకృతి వారిపైఁ బగఁబూని 'ముప్పతిప్పలుపెట్టి మూఁడు చెఱువుల నీరు త్రాగించు' చుండెను. వారెట్లో మూఁడవ మకామునకుఁ జేరి తాత్కాలికపటకుటీరముల నిర్మించు కొనిరి. కాని సక్రమముగ నిర్మింపఁ జాల రైరి.

ఈ పటకుటీరములందైనను వారినిఁ గష్టములు విడువ వయ్యెను. ప్రకృతి ప్రళయతాండవ మట్లే యుండెను. గాలి తీవ్రతయు హిమవృష్టియు నేమాత్రము తగ్గవయ్యెను. మంచు దుమారములు చెలరేగెను. శైత్యబాధ మిక్కుట మయ్యెను. ఇంతలోఁ గ్రింది శిబిరముల నుండి మూఁడవ శిబిరమున కాహారపానీయములు వచ్చెను. దీనితో నారోహకులకుఁ గొంత యుత్సాహము పొడసూపెను. కాని వెనువెంటనే వారియుత్సాహము మటుమాయ మయ్యెను. ఏలయనఁ బ్రకృతి తనపట్టుదలను వీడ దయ్యెను.

ఆ రాత్రి యారోహకుల కొక గండ మనియే చెప్ప వచ్చును. ఆ రాత్రియే యననేల! ఈ యాత్ర యంతము వారికి 'దినగండము నూరేండ్లాయు' వన్నట్లు కడచినది. గాఢాంధకార మినుమడించెను. హోరుగాలి ప్రళయతాండవ మొనరించు చుండెను. మంచుపొడి గుడారములలోఁ బ్రవేశించి వస్తుసామగ్రిని గప్పివైచు చుండెను. ప్రతివస్తువు పైనను మంచు పేరుకొను చుండెను. పడకసంచుల పైభాగమున మంచు పేరుకొనుటచే లోపలిభాగములు చల్లఁబడి నిదుర పట్టదయ్యెను. ఇన్ని బాధలతో వారారాత్రి వేగించిరి. సూర్యదర్శనముతో హిమవృష్టి యుపశమించెను. కాని వాయువేగ మినుమడించెను. కొంత భారమును దగ్గించుకొనుటకై వారు కొంతమంది భారవాహకులను గ్రిందిమకాము నకుఁ బంపిరి. కాని 'దుంగ విడిచి దూల మెత్తికొని' నట్లు

మఱియొక భారము వారిపైఁ బడెను. వాయువేగమున బట కుటీరములు తటతట గొట్టుకొన సాగెను. కొంతవడికిఁ బ్రకృతి కాంత తన యాగ్రహమును గొంత వీడెను. అప్పటికిఁ బ్రతి వారును మిగుల డస్సిపోయిరి. కాన వారు మూలశిబిరమును జేరి కొంతకాలము విశ్రాంతి దీసికొని మరల బయలుదేరఁ దలచిరి. కాని యదిమాత్రము సులభసాధ్యమా? కొంతమంది భారవాహకులు ప్రాణములపై నాశ వదలుకొని యట్లే నిదుర సంచులలో మునగఁదీసికొని పరుండి లేవరైరి. బ్రూసువారి కుత్సాహము బురికొల్పి యెట్లో లేవదీయునప్పటికిఁ దల ప్రాణము తోఁకకు వచ్చెను.

ఇట్టి యననుకూల పరిస్థితులందు బురోగమింపనెంచుట మౌఢ్యమని యెంచి యారోహకులు 'బ్రతుకు జీవుడా' యని మూలశిబిరమునకుఁ జేరిరి. తరువాతఁ గొంత కాలము విశ్రాంతిఁ దీసికొని నూతన పథకములఁ గూర్చి యాలోచింప సాగిరి.



28.8.54

# 6

# తరువాతి యత్నము

అపజయము లెక్కువైన కొలఁదియు నారోహకుల యభిలాష మెండయ్యెను. తమ ప్రయత్నమును విరమింపక వారు మఱొకమారు సంసిద్ధులైరి. గతప్రయత్నమున నేడు గురు కూలీలు మరణించిరి. అందువలన నారోహకులు కూలీల యందు నూత్నోత్సాహమును బురికొల్ప వలసి వచ్చెను. నూత్నయత్నమునకు సుముఖులుగ నొనర్చుటకై వారు రాంబక్ మఠాధిపతియైన దలైలామా యాశీర్వచనము బొందు టవసరమని యెంచిరి.

ఆరోహకులును, భారవాహకు లట్లే దలైలామా దీవనలఁ బొందిరి. కాని యారోహకులందు బీటుహాము వ్యాధి గ్రస్థుఁ డయ్యెను. మరల నిరువురు భారవాహకులు మృత్యువాతఁ బడిరి. మిగిలిన వారెట్లో తృతీయ శిబిరమును జేరుకొనిరి. ఇప్పటికిఁ దృతీయశిబిరమునందు నార్టన్, సోమరువెల్, ఓడెలు, మేలరీలును, ద్వితీయమునందు హాజార్డు, యిర్వినులు, మొదటి కుటీరమున నోయలు బ్రూస్‌లును మూలశిబిరమునందు హింగ్స్టను, బీటుహాములు నుండిరి.

అపాయములకుఁ బుట్టినిల్లగు నార్తుకాలు పర్వతము దాటి నాల్గవ శిబిరము నిర్మించ వలెనని వారి యాశయము. కాని యది సులభసాధ్యమగు కార్యము కాదు. ఎట్లో

నిరపాయమగు మార్గము నొకదానిని కనుఁగొని నాల్గవ శిబిరమున కనువగు స్థలమును నిర్దేశించికొనిరి. దానిలో మేలరీ కొక యపాయము తటస్థించెను. హిమావృతమగు నొకగోతిలో కూలి, మిత్రుల సాయమున జావుదప్పి, కన్ను లొట్టవోయి పైకి రాఁగల్గెను. ఈ యాటంకము వలనఁ బ్రయాణము కొంత మందగించెను.

శరీరస్వాస్థ్యము చేకూరు వఱకు విశ్రాంతి గైకొని మేలరీ, బ్రూసు లిరువురు పురోగమనము సాగించిరి. కాని కూలీల నిరుత్సాహము వలన వారిరువురు వెనుదిరుగవల సిన వారైరి. దిగునపుడు మధ్యేమార్గమున నార్టన్, సోమరు వెల్లు లెదురైరి. వాతావరణ మనుకూలముగ నుంటచే వారు నాల్గవ శిబిరమును గూడ దాటి పంచమ శిబిరము జేరఁగల్గిరి. వీరిరువురు నెట్లో 26,800 అడుగుల యెత్తునకుఁ బోయిరి. అటనుండి యడుగులో నడుగు పెట్టుకొనుచు, వంగివంగి యెట్లో ప్రాకి పోవుచు, 27,500 అడుగుల యౌన్నత్యమును మెట్టఁ గల్గిరి. కాని యెవరెస్టుంకను నందని ద్రాక్షపండువలె నుండెనే కాని స్వాధీనమగు నాశ కన్పట్టదయ్యెను. మానసికముగను, శారీరకముగను వారు క్రుంగిపోవు చుండిరి. చలిబాధ మిక్కుటమయ్యెను. దృష్టిమాంద్య మంకురించెను. కంఠ రోగము కారించు చుండెను. కాని పట్టుదలమాత్రము సడల దయ్యెను. నార్టను, సోమరువెల్లు లిరువురు వంగి మోకాళ్ల పైఁ బ్రాకిపోవుచు తుదకు 28,000 అడుగుల యెత్తున కెగఁబ్రాకఁ

గల్గిరి. అప్పటికి సోమరువెల్లున కొక్క యడుఁగైన ముందు నకు సాగక 'కాడి క్రిందఁ బడవైచి' కూలఁబడెను. నార్టను మాత్ర మింకొక్క నూటయిరువదియారడుగుల మేర నధిగ మింపఁ గల్గెను. అంత నిరువురు తిరోగమింప వలసినవారైరి. దైవ మనుకూలింప కున్నఁ బౌరుష మెంతవఱ కక్కఱకు వచ్చును?

ఇంతలో నలసట దీర్చికొన్న మేలరీ, యిర్వీను లిద్దఱు ద్విగుణీకృతోత్సాహమున మరల బయలు దేరిరి. విజయ సంపాదన మొనర్ప వలెనన్న ధృఢసంకల్పమున నడుగిడ సాగిరి. చిక్కి శల్యావశిష్టులగు సోమరువెలు, నార్టను లెదురై వారిసంకల్పమునకు హర్షించి ప్రోత్సహించిరి. మేలరీ, యిర్వీను లట్లు నాల్గవ శిబిరమును దాటి పంచమ శిబిరమునకు బ్రాకఁ గల్గిరి. అద్దాని గూడ నధిగమించి యాఱవ శిబిరమునకు బయనము సాగించిరి.

ఏలకో ప్రకృతికాంత కొంత శాంతముగ నుండెను. గాలి యేమంత వీచుట లేదు. ఆకాశము నిర్మలముగ నుండెను. అంతయు నాశాజనకముగ నుండెను. పయనము చకచక సాగుచుండెను. మేలరీ, యిర్వీనులు శిఖరమును గూర్చి ప్రయాణము సల్పుచుండిరి. వెనుక నాల్గవశిబిరమున నున్న నోడెలు గూడ వెనువెంటనే వచ్చుచుండెను. ఇంతలో బ్రకృతికాంత మరల నొకపఱి గ్రుడ్లెఱ్ఱఁ జేసెను. పొగమంచు కావురు గ్రమ్మెను. ఈ మంచు తెఱలగుండ నోడెలు ముందు

పోవు నారోహకులఁ గాంచుచునే యుండెను. తాను పురోగ మించుచునే యుండెను. కొంతసేపటికి వారు ఛాయామాత్ర ముగఁ గన్పట్టసాగిరి. వీరిగమనగతిఁ గనిపెట్టుచు నోడెలట్లే నిలఁబడెను. కాని కొన్ని నిముసములు గడచిన పిమ్మట వారి జాడయే కానరా దయ్యెను. భయవిహ్వలుఁడగు నోడెలు మిత్రులిరువుర కొఱకు నిరీక్షింపసాగెను. కాని వారి పొలకువ యేమాత్రము గన్పట్టదయ్యెను. మరల నోడెలు 200 అడుగుల పైకిఁ బోయి మిత్రాన్వేషణ మొనర్చెను. కాని ప్రయోజన మించుకయుఁ గన్పట్టదయ్యెను. అతడు నిరాశాపూరితుఁ డయ్యెను. సందిగ్ధావస్థ యందు బడెను. మిత్రుల కొఱకు నిరీక్షించుటయా? క్రింది నార్తుకాలు శిబిరమును జేరుటయా? ఏమియు దోచ దయ్యెను. కొంత తడవు వితర్కించి తిరో గమనమే సిద్ధాంతీకరించు కొనెను. మేలరీ, యిర్విను కొఱకు గొంత యాహార మాఱవ శిబిరమున దాచి తాను క్రిందికి దిగివచ్చెను. నాల్గవ శిబిరమున హజార్డును గలిసికొని యిరు వురును వారికొఱకు నిరీక్షింప సాగిరి. చూచి చూచి కన్నులు కాయలు గాచెనే కాని వారి యాగమనచిహ్న మించుకయు గాన రాదయ్యెను. నోడెలు మరల నొకపతి యైదవ శిబిరము నకుఁ బోయి మిత్రులకొఱకు వెదకెను గాని లాభ మిసు మంతయు లేదయ్యెను. వారు శాశ్వతముగ నంతర్ధాన మొంది రని స్థిరీకరించు కొనెను.

మేలరీ, యిర్వినుల మరణవార్త యనతి కాలమున కారు

చిచ్చువలె ప్రపంచమంతయు వ్యాపించెను. ఒక యుత్కృష్ట కార్యసాధనకై యాత్మార్పణ మొనర్చిన వారి ధైర్యసాహసములు, త్యాగశీలము ప్రపంచమంతయు నొక్కసారి మాఱు మ్రోగెను.

కాని వీరి దుర్మరణవార్త పర్వతారోహకులందు గొంత నిరుత్సాహము గల్పించెను. ఎన్ని ప్రయత్నము లొనర్చినను విజయము చేకూరదయ్యెను. మితిలేని ధనము కావలసి వచ్చెను. మేలరీ మున్నగు ననుభవజ్ఞుల సాయము కఱవయ్యెను. ఈ కారణమున దొమ్మిది సంవత్సరములవఱకీ ప్రయత్న మెవ్వరును సేయరైరి. కాని 1932వ సంవత్సరమున మరల నొక దండయాత్రకు సన్నాహములు జరిగెను. ఈ యాత్రకు హ్యూరట్ లెడ్జ్ నాయకుఁడయ్యెను. పదునలుగురు సభ్యులు దళము నందు జేరిరి. వీరును దమ పూర్వ యాత్రికుల వలె దలైలామాను దర్శించి, యాశీర్వచనములఁ బొందిరి.

కొంతవఱకు వెనుకటి మార్గము ననుసరించి పురోగమించిరి. కాని యాపైన పూర్వమార్గచిహ్నములు కన్పట్టవయ్యెను. ఆ ప్రాంతమున మానవసంచారము జరిగి తొమ్మిది వత్సరము లయ్యె గదా! ఇంక యడుగులజాడ లేమి యగుపడును? కావున స్వయంకృషిపై నాధారపడి నూత్నమార్గముల నెమకి కొనుచు వారు పయనము సాగించిరి. ప్రచండ వాయువుల కెదురీత నీదుచు యాత్రికు లపాయముల పుట్ట

యగు నార్తుకాలును దాటిరి. ప్రకృతికాంత మరల ప్రళయ తాండవ మారంభించెను.

ఋతుపవనములు ప్రారంభమై భీభత్సములగు తుపానులు చెలరేగుచుండెను. ప్రకృతి శాంతము వహించు నప్పటికి వారము దినములు పట్టెను. అంత యాత్రికులు తమ దారి సాగించి యింకొక 700 అడుగుల యెత్తున కేగఁగల్గిరి. అనగా నప్పటికి 28,000 అడుగుల యెత్తునకు బోఁగల్గిరి. ఇంతవఱకు బూర్వయాత్రికులు గూడ నేగిరి. కాని క్రొత్త యేమియు లేదు. యాత్రికు లొకచోట సాహసోపేతులగు నిర్వీను, మేలరీల మంచుగొడ్డలి గనుఁగొనిరి. వారి నేత్రము లొకించుక చెమ్మగిల్లెను. ఒకటి, రెండు వేడి కన్నీటి బిందువులు రాల్చి మిత్రులకు బాష్పాంజలి నొసఁగిరి. ఎట్లో పయనము సాగించి యనేక కష్టనిష్ఠురములకు లోనైరి. కాని 28,100 అడుగుల యెత్తు నతిక్రమించి పోఁజాలరైరి. అంతట మరల ఋతుపవనములు పైకొనునను భయమున జట్టు వారందఱు మూలశిబిరము చేరిరి.

కాని యారోహకుల యాత్మవిశ్వాస మింకను బూర్తిగ నశింపలేదు. 1935 లో నెవరెస్టు శిఖరారోహణకు మరల నొక ప్రయత్నము జరిగెను. హ్యూరట్ లెడ్జియే నాయకుఁడు. ఈసారి పశ్చిమదిశనుండి యారోహణ నారంభించిరి. వీరెన్ని దిక్కులు మార్చినను బ్రకృతికాంత మాత్రము తనపట్టుదల వీడ దయ్యెను. ఋతుపవనములు తమ ధర్మమును మాన

వయ్యెను. భీకరమారుతమునకు హిమవృష్టి తోడయ్యెను. యాత్రికు లట్లే తమయాత్ర సాగించుచుండిరి. కాని వాతావరణ సహకారము శూన్యమై, యాత్రికులకు విఘ్నము లనంతమై వెన్నుజూపిరి. ఆరోహకు లీ యాత్రయందు రేడియో సాధనముల సాహాయ్య మపేక్షించినను యాత్ర సఫలీకృతము కాఁజాలదయ్యెను.



7

# విమాన యానములు

ఈ యారోహణకృత్యమునఁ బలువురు సాహసికులు ప్రాణము లర్పించిరి. కోట్లకొలఁది ధనము వ్యయమయ్యెను. ప్రాణములతో నున్న యాత్రికులు పలుబాముల పాలైరి. కాని యెవరెస్టు శిఖర మీఁదఁ బాత్రము లాఁగలేదు. మానవ శక్తి కైనను హద్దుపద్దు లున్నవనియు, మానవుఁడు సాధించ లేని కార్యము, యంత్రము సాధించి తీరుననియు శాస్త్రజ్ఞు లభిప్రాయ పడిరి. ఈ యభిప్రాయమే విమాన యానమునకుఁ బ్రధాన కారణ మయ్యెను.

అప్పటికే వైమానికులు వేగమునందును, నున్నత పథము లందుటందును నభివృద్ధి గాంచిరి. అందువలన నెవరెస్టు మీఁదుగ విమానయాన మొనర్ప వచ్చునని కొందరాంగ్లేయ వైమానికు లభిప్రాయపడిరి. స్టూవర్టు బ్లాకరు, కర్నల్ ఈథర్టన్ననువారీ కార్యమునకు బద్ధకంకణులైరి. ఈ విమాన యాత్ర కొక సమితి గూడ నేర్పాటయ్యెను.

కాని 'ధనమూల మిదంజగత్తు' నన ట్లే కార్యమున కైనను ధన మావశ్యకము గదా! సమితివా రింతధన మెట్లు సేకూర్పఁ గలరు? దీనికి తోడు ప్రపంచమున నార్థికమాంద్యము మెండయ్యెను. విమానయానమున నభిమానముగల హౌస్టన్‌సతి యను నొక ధనికురాలు గలదు. సమితి వా

రామెకు యాత్రాప్రాధాన్యమును గూర్చి నచ్చఁజెప్పి, ధన సాహాయ్య మపేక్షించిరి. ఉదారగుణాఢ్యయగు నామె తత్క్షణమే వారివిన్నప మంగీకరించెను. కావలసిన ధన సాహాయ్యమొనరించెను. కనుకనే యామె యందలి కృతజ్ఞతా సూచకముగ యాత్రికులు తమ యాత్రకు 'హూస్టన్ విమాన యాత్ర' యని నామకరణ మొనరించిరి.

ఎవరెస్టు స్వతంత్రరాష్ట్రములగు టిబెటు, నేపాళము లందు విస్తరించి యున్నదనియు, నారాష్ట్ర ప్రభుత్వము లితరు లను దమరాష్ట్రములం దడుగిడ నీయవనియు మున్నే చెప్పి యుంటిమి గదా! 'అన్నియు నొకయెత్తు, యగస్తుని కమండలు వొకయెత్తని' నట్టి యాజ్ఞఁ బడయుట దుర్లభము. శాస్త్రీయ విజ్ఞానసేకరణార్థమే తమయాత్ర సంకల్పింపఁ బడినదని వైమానికు లా ప్రభుత్వములకు నచ్చఁజెప్పునప్పటికిఁ దల ప్రాణము తోఁకకువచ్చెను. ఎట్లో యంగీకారపత్రము సంపా దించు నప్పటికిఁ గృత్యాద్యవస్థ యయ్యెను.

ఈ యాత్ర కింకొకటి గూడ మిగుల నవసర మయ్యెను. హిమాలయములకుఁ జేరువగ నందుఁబాటులో నుండున ట్లొక విమానాశ్రయ మవసర మయ్యెను. కలకత్తాకు 260 మైళ్ల దూరమున లాల్‌బా లను గ్రామ సామీప్యమున నీ యాశ్రయము నిర్మించిరి. దర్భాంగమహారాజట దనకుఁ గల భవనమును యాత్రికుల వసతికై ఉచితముగ నొసగెను. ఎవరెస్టుపై విహరించుటకు ప్రత్యేకముగ నిర్మింపఁబడిన

విమానముల నుచితముగ నీ దేశమునకు దిగుమతి యొనరించు టకై యొక నౌకావ్యాపారసంస్థ వారంగీకరించిరి. కలకత్తా యందలి వాతావరణ పరిశోధనాలయము వారెప్పటి వాతావరణస్థితి నప్పుడు యాత్రికుల కుచితముగఁ దెల్పుచుండుట కంగీకరించిరి.

ఉన్నతపథములఁ దేలికగ నెగురఁగల వెస్టులెండు విమానములని యొక ప్రత్యేకజాతి విమానములు నిర్మింపఁ బడెను. వీని యధోభాగమున ఛాయాగ్రాహకయంత్రము లమర్పఁ బడెను. కొన్నిటికిఁ బార్శ్వ భాగములందు గూడ నీ యంత్రము లేర్పాటు జేయఁ బడెను. విమానములందున్న ప్రాణవాయుగోళములనుండి గొట్టముల ద్వారమున వైమానికుల శ్వాసకోశముల లోనికి ప్రాణవాయువుపోవు నేర్పాటు జేయఁబడెను. వైమానికులకుఁ బ్రత్యేకదుస్తు లమర్పఁ బడెను. వారికిఁ బ్రత్యేకపుఁ గంటిజోళ్లు, కాలిజోళ్లు కూడ నేర్పాటు చేయఁబడెను.

ఇన్ని కట్టుదిట్టములతో క్లైడ్సువెల్, బ్లేకరు, మాకిన్ టైరు, బానెటను వైమానికులు లాల్ బాల్ విమానాశ్రయము నుండి బయలుదేరిరి. వీ రెల్లరు దృఢకాయులు, ఆరోగ్య వంతులు. వైమానికులు 30,000 అడుగుల యెత్తున కెగిరిన పిమ్మటఁ గ్రిందికిఁ జూచిరి. త్రిభుజాకారముగ నున్న నెవరెస్టు పీఠమును, దాని కనతిదూరమున నున్న మకాలు, గౌరీశంకర శిఖరములను జూడఁ గల్గిరి. అత్యున్నతములగు పర్వతపంక్తు

లయు, నగాధములగు లోయలయు నున్నతములగు పీఠభూము లయు ఛాయాచిత్రములఁ గైకొనిరి.

కొంత కాలమునకు వైమానికు లెవరెస్టుపైన రెండు, మూఁడు వేల అడుగుల యెత్తునకుఁ బోఁ గల్గిరి. కాని యచట వాయువేగము మిక్కుటముగ నుండెను. అంతరిక్షమున శిఖరముపై విహరించు విమానముల లోనికి గాలివేగమునఁ జిన్న చిన్న మంచుగోళములు పడుచుండెను. అట్లా శిఖరముపై యిరువది నిముసములు విహరించి, యవసరములగు ఛాయా చిత్రముల నన్నిటిఁ గైకొనిరి. ఇఁక నటనున్న ననేక ప్రమా దములకు గుఱి కావలసి వచ్చు నని వైమానికులు విమానా శ్రయ గమనోన్ముఖు లైరి.

ఎవరెస్టు శిఖరముపై నెగురుచు దీసిన ఛాయాచిత్రము లెప్పటికైన విజ్ఞానార్జన కత్యవసరము. కాని వైమానికులు కష్టపడి తీసిన ఛాయాచిత్రములు చెడిపోయి, పనికి మాలిన వయ్యెను. అదికారణముగ వైమానికులు మఱియొకసారి శిఖరముపై కెగురఁ దలఁచిరి. అట్లే రెండవసారి రెండు విమానములును దారాపథమున కెగిరెను. 31,000 అడుగుల యెత్తునకుఁబోయి బ్లేకరు మరలఛాయాచిత్రములఁగైకొనెను. విమానాశ్రయమునకు వచ్చి చిత్రముల బరీక్ష నొనర్ప, నవి యీసారి సరిగనే యుండెను. ఇట్లు విమానయాత్రలు విజయ వంతము లయ్యెను. ఈ విజయవార్త నింగ్లాండున నున్న హూస్టన్ సతికిఁ దెలియఁ బఱచిరి.

ఈ విధముగ నెవరెస్టుపై మానవుఁడు 1921 మొదలు 1952 వఱకు బదునొకండు సారులు దండెత్తి, యెత్తినపుడెల్లఁ బరాజితుఁడయ్యెను. తుదకు వ్యోమయానమున మాత్రము జయింపఁ గల్గితినని తృప్తిఁ గాంచెను. ఈ ప్రయత్నములందు గొంద ఱారోహకులు మృత్యువాతఁ బడిరి. భారవాహకులు గొందఱు పరమపదించిరి. కోటానుకోట్లు ద్రవ్యము వ్యయ మయ్యెను. కాని కాలినడకను బోయి యా శిఖరమును గన్నులారఁ గాంచఁ గల్గిన ధీరుఁ డొక్కఁడును లేఁడయ్యెను.



# 1

# టెన్‌సింగు నార్కే

నేపాళీయులు పర్వతారోహణమునందు గడుంగడు నిపుణులు. అందును షెర్పాజాతి వారు మిగుల ప్రవీణులు. మన టెన్‌సింగు వీరుఁడు నేపాళదేశీయుఁడే. షెర్పాజాతికిఁ జెందిన వాఁడే. నేపాళ రాష్ట్రమందలి సోలోఖుం బను ప్రదేశమున నీతఁడు జన్మించెను. ఈతని పూర్తినామము టెన్‌సింగు నార్కే. నేపాళమున జన్మించినను డార్జిలింగు, పశ్చిమ బంగాళములం దీతఁ డెక్కువకాలము గడపెను.

కోటేరువంటి ముక్కును, చెవులపై వ్రేలాడు నల్లని తుమ్మెదరెక్కలవంటి కురులును గల్గి మందహాససుందరవదనారవిందముతో నీతఁ డొక యందగాఁడే యనిపించుకొనెను. ఈతఁ డాజానుబాహుఁడు. ఈతని వయసిపుడు 38 వత్సరములుండును. ఈతఁడు 1947 వఱకును బాగుఁగ వ్రాయనైన లేఁడమ్యెను. కాని హిందూస్తాని, సిక్కిం, టిబెటన్ మున్నగు భాషలు మిగుల ధారాళముగ మాటాడఁ గలఁడు. ఇంగ్లీషు మొదలగు కొన్ని పాశ్చాత్య భాషలు గూడ నడపదడప మాటాడఁ గల శక్తి కలదు.

ఈతఁడు ధైర్యసాహసములకు నిధి. దృఢగాత్రుఁడు. వినయవిధేయతలు గల బౌద్ధభక్తుఁడు. చుఱుకైన వాఁడు. తుదకు ధూమపానదురభ్యాసము గూడ నెఱుఁగని సచ్ఛీలుడు.

గుఱ్ఱములు, గాడిదలు, కంచరగాడిదలు, యాక్కులు, మున్నగు భారవాహకమృగముల నదుపునఁ బెట్టుట యందు గొప్ప దిట్ట. ఇన్ని సద్గుణము లున్నను నీతడు నిగర్వచూడామణి. నిరాడంబరుఁడు. ఎవరెస్టు ప్రథమవిజేత యని ప్రపంచఖ్యాతి నందినను నీతఁ డొకించుకయు గర్వింపఁ డయ్యెను.

ఎవరెస్టు మానవశక్తినిఁ బరీక్షించుటకై నిర్దేశింపఁ బడిన యొక పరీక్షాస్థలమే కాని ప్రతికక్షిగాదని యిప్పటికిని నాతని నిశ్చితాభిప్రాయము. అందువలననే యాతఁ డద్దానిని శత్రుభావమునఁజూడక మిత్రభావమున నాదరించెడి వాఁడు. తోడి యారోహకు "లెవరెస్టును జయింపఁగలమా?" యని యాతనిఁ బ్రశ్నింపఁ "బ్రయత్నించి చూత" మనెడి వాఁడు. పరద్రవ్య మనిన విషప్రాయముగ నెంచు స్వభావము గల వాఁడు. ఎట్టి విపరీతపరిస్థితులందును నసంతుష్టి యనుమాటయే యెఱుఁగఁడు. ఆరోహణకృత్యమందు పెక్కుమాఱు లప జయము గాంచినను గొప్ప వేదాంతివలెఁ దలయొగ్గి పరా జయమును భరించెడి వాఁడు.

పైఁజెప్పన పదునొకండు దండయాత్రలలో నేడింటి యందు టెన్ సింగు పాల్గొనెను. అందువలన నచలారోహణ మున మంచి యనుభవము గడింపఁ గల్గెను. ఈతఁడు తన పదునెనిమిదవ యేటనే పర్వతారోహణ ప్రారంభించెను. సహజముగ బర్వతప్రాంత శీతోష్ణస్థితి కలవాటు పడినవాఁడు. కాన నిన్ని పర్యాయములు నిరపాయముగఁ బ్రయత్నింపఁ

గలైను. ఇతరు లందఱి కన్న నెక్కువసారులు పర్వతా రోహణ మొనర్చినది మన టెన్‌సింగే. హిమాలయమందు బెక్కు శిఖరములఁ గాంచఁ గల్గినది కూడ నితఁడే. ఈతఁడు నందదేవి నారసెను. కామెటును గాంచెను. నంగపర్బతును గనుంగొనెను. కేదారనాథ్, బందరుపంచ్ మున్నగు శిఖర ముల నెన్నిటినో మెట్టఁ గల్గెను. ప్రథమమున భారవాహ కుఁడుగఁ బనిచేసినను దుద కారోహకుఁడు గాఁ గల్గెను. అతని యారోహణకృత్య మెట్లు క్రమక్రమముగ నభివృద్ధి గాంచెనో యారయుఁడు :—

1935 – భారవాహకుఁడుగ నుండి యాఱవ శిబిరము వఱ కేగెను.

1936 – గొప్ప బరువుల మోయుచునే యాఱవ శిబిరము జేరెను.

1938 – టిల్‌మన్ దళముతోఁ గూడ భారవాహకుఁడుగ నుండెను.

1947 – డెన్‌మానునకు భారవాహకుఁడుగ నుండి, భార వాహకుల కెల్ల మార్గదర్శకుఁడై, 23,500 అడు గుల యెత్తున కేగెను.

1952 – మొదటి స్విస్ దండయాత్రాదళమునకు భార వాహక నాయకుఁడుగ నుండి 28,210 అడుగుల యెత్తున కేగఁ గల్గెను.

1952 – రెండవ స్విస్ దళమునఁ గూడ భారవాహకుఁ

డుగ బనిచేసెను.

1953 – విజయవంతమగు బ్రిటిష్ దళసభ్యుఁడుగ నుండి
మే 29 వ తేదీన నెవరెస్టును జయింపఁగల్గెను.

ఈదినమే, పర్వతారోహణ చరిత్రయందు టెన్ సింగు నామముతోఁ గూడ, సువర్ణాక్షరముల లిఖింపఁ దగినది.

టెన్ సింగు భార్యపేరు అంగలాహం. ఆయన కిరువురు కుమార్తెలు గూడఁ గలరు. వారిరువురును డార్జిలింగు నందలి యాంగ్లేయ పాఠశాల యందు విద్యాభ్యాస మొనర్చు చుండిరి. ఆయన కొక సోదరియుఁ గలదు. ఆమె రాంబక్ మఠము నందలి యొక బౌద్ధాచార్యుని వివాహమాడెను. ఆమెయు టెన్ సింగు వలెనే సరళహృదయము గలది. రాంబక్ మఠముటిబెటు వైపున, నెవరెస్టునకు నుత్తరదిశను సుమారు పదునాలుగు మైళ్ళ దూరమునఁ గలదు. ఆరోహకదళముల వస్తుసామగ్రి నంతయు నామె జాగ్రత్తగఁ గాపాడి దిగివచ్చునపుడు మరల నప్పఁ జెప్పును.

టూన్ సాంగు జిల్లా యందొక చిన్న కుటీరమున టెన్ సింగు తన సంసారయాత్ర గడపు చుండెను. ఆ కుటీరమునం దొక్కటే గది కలదు. అయ్యది సుమారు 12 చ. అ. వైశాల్యము మాత్రము గలిగి యుండును. పైకప్పు తలకుఁ దగులు చుండును. అంత కంటె యోగ్యమగు వసతి వారికిఁ జిక్క దయ్యెను.



# 2

# టెన్ సింగు యత్నములు

షెర్పాలు పాశ్చాత్య పర్వతారోహకులను 'తెల్ల సాహెబు'లని పిలుచుట వాడుక. ఎవరెస్టు మార్గమున నొక నాఁడొక తెల్లసాహెబు పైకి పోవుచుండుట టెన్ సింగునను లీలగఁ గన్పడుచుండెను. వెన్నంటుచున్న టెన్ సింగు మోయరాని భారము వహించి వంగివంగి నడచుచుండెను. టెన్ సింగు తన జీవితమున నిట్టి సాహసికు నెప్పుడును జూచి యెఱుఁగఁడు. ఆతని కురులు హరితవర్ణము గలిగి యుండెను. నయనములు నీలవర్ణముగ నుండెను. ముఖమండలము లేత యెఱుపు రంగు గలిగి యుండెను. ఆతని దుస్తులు వింతగ నుండెను. ఎరిక్ షిప్టనను నాతని పేరే టెన్ సింగున కాశ్చర్య కరముగ నుండెను. కాని యాతని కది పరిచితనామమే. పది సంవత్సరముల క్రిందట నాపేరు టెన్ సింగు సోలాఖుంబులో విని యుండెను. తెల్లసాహెబులకుఁ బర్వతారోహణ మనినఁ గ్రీడాప్రాయ మనియు, నందు షిప్టను ఘటికుఁ డనియు, నారోహణ సమయమున షెర్పాలకుఁ బుష్కలముగ ధన మిత్తు రనియు టెన్ సింగు పితృపితామహులు తఱచు చెప్పుచుండెడి వారు. అన్ని పర్వతప్రాంతములందును షిప్టన్ ఘనకార్యము లొనరించె ననియు, నింకను నొనరింప నున్నాఁడనియు నాఁతఁడు విని యుండెను.

భగవదనుగ్రహమువలన నిప్పుడు షిప్టన్ టెన్ సింగును దనకు సహాచరుఁడుగ నుండు మనియు, నెవరెస్టును బరిశోధింపు మనియుఁ గోరెను. షిప్టన్ మాట యొక్కటియు నీతని కవగాహన గాదయ్యెను. కాని భారవాహకుఁడగు తన్ను నారోహకుఁడుగఁ జేయఁదలఁచిన దీయనయే యని మాత్రము గ్రహింపఁ గల్గెను. తాను పాల్గొను ప్రథమారోహక దళమునకు షిప్టన్ నాయకుఁడగుట టెన్ సింగు నదృష్ట మనియే చెప్ప వచ్చును. శిఖర మారోహించితి ననియే యాతఁ డెంచెను. కాని యది సామాన్య కార్యము గాదు. మాటలతో నెర వేరు పనియుఁ గాదు. షిప్టన్ 1935 లోనే నూతనారోహకులను, నూతన భారవాహకులను బ్రోత్సహించి విజయము గాంచ నెంచెను.

ఈసారి షిప్టన్ తన వెంట నాలుగు రారోహకులను, బదునైదుగురు షెర్పాలను దోడ్కొని పోయెను. సక్రమారోహణకు వందల కొలఁది షెర్పా లవసరము. వారికి 10,000 పౌనులు వ్యయపఱుప వలెను. కాని షిప్టన్ 1,400 పౌనుల కంటె నెక్కుడు వెచ్చింపఁ దలఁపలేదు. టెన్ సింగు దళమునందే మూలనో యొదిఁగి యుండక యారోహకు లందఱి కన్న మిన్న యనిపించు కొన వలెనని నిశ్చయించెను. తన మనోదార్ఢ్యము, నుత్సాహము, బలము ప్రదర్శింప నెంచెను.

సాధ్య మగు నంత వఱకుఁ దక్కువ యాటంకములతో నారోహణ సాగ వలయునని షిప్టన్ దృఢాభిప్రాయము.

జనాకీర్ణ ప్రదేశములకు దూరమున నివసించి బలము నార్జింప వలయు నని యాతని మనోభీప్సితము. ఇదియు టెన్‌సింగున కనుకూల మయ్యెను. ఏల యన నాతఁ డీవలఁ కే కొండలోయ లందు జరించి యెలుఁగుబంటులు, చిఱుతపులులు మున్నగు దుష్టమృగముల వేఁటాడు చుండెడి వాఁడు. ఎవరె స్టజేయ మగు శత్రువని టెన్‌సింగు గ్రహింపఁ గల్గిన దీ దండయాత్ర యందే. ఆతఁడు మూఁడవ మకామున మారిస్ విల్స నను నారోహకు నస్థిపంజరము గాంచెను. విల్సన్ తన దినచర్య పుస్తకమునందు 'నార్తుకాల్ పర్వతమునకు బోనెంచితిని గాని యలసి పోయి గుడారమునకు వచ్చి మరణించితి' నని వ్రాసి యుంచెను.

షిప్టన్ దళము ఋతుపవనసమయమున బయలు దేరెను. ప్రతికూలవాతావరణకారణముగ వారెక్కు డున్నత ప్రదేశమును జేరఁ జాలరైరి.

టెన్‌సింగు తిరిగి డార్జిలింగు చేరుకొనెను. ఈ దండ యాత్రతో బర్వతము జయించు విధానము నేర్చికొంటి నని యాతఁడు సంతసించెను. అచిరకాలముననే, యనగా మఱుసటి వసంతమున, నాతఁడు హ్యూరట్ లెడ్జి నాయకత్వమున 1936 దండయాత్రలోఁ బాల్గొను నవకాశము చిక్కెను. ఇది చాల దుర దృష్టవంత మగు దండయాత్ర. ఏల యన నొక నదిని దాటు ప్రయత్నమున నొక భారవాహకుఁడు మరణించెను. వాతా వరణస్థితి విపరీతముగ నుండి నందున ఘనకార్య మెద్దియు

జరుగ దయ్యెను. కాని టెన్‌సింగు మాత్రము నార్తకాలు జేరఁ గల్గితిఁ గదా యని సంతృప్తిఁ గాంచెను. గమ్యస్థానము చేరువగు చున్నదిలే యని తుష్టిఁ బొందెను.

మరల నాతఁడు 1938 లో టిల్‌మన్‌తో బయల్వెడలెను. టెన్‌సింగు నామ మెవరెస్టు 'రికార్డు' నందు తఱచు గాన్పించు చుండెను. టిల్‌మ సీతని గుఱించి యువకుఁడనియు, జురుకైన వాఁడనియు, బలాఢ్యుఁ డనియు, స్నేహపాత్రుఁ డనియు రచించెను. 25,000 అడుగుల యెత్తున నితర షెర్పాలందఱు నిరుత్సాహము గన్పఱచి నపుడు టెన్‌సింగు మిగుల సంతోషముగఁ గన్పట్టెననియు నాతఁడు లిఖించెను. 26,000 అడుగుల యెత్తున బటకుటీర నిర్మాణమున నాతఁడు తనకు మిగుల సహకరించె ననియు, నందులకై యాతనికి మంచు పులి అను బిరుదును, పతకము నొసఁగఁ బడె ననియు గూడ రచించెను.

ఈ దండయాత్రలో దుదిక్షణమున నెవరెస్టు తన ప్రత్యర్థులపై నమితాగ్రహము వెడలఁ గ్రక్కెను. ఈసారి బసాంగుభోట్లా యను మఱియొక భారవాహకునిపై దన దృష్టి సారించెను. మొట్టమొదట నాఱవ మకాములో నాతనికిఁ బిచ్చి యెత్తినదని యందఱు తలఁచిరి. కాని తదుపరి యాతని దక్షిణ పార్శ్వము పక్షవాత హత మయ్యె నని కనుఁగొనిరి. ఆతఁ డిట్టుప్రక్క నటు పొర్ల లేఁడయ్యెను. మాట పడి పోయెను. ఆహారము గూడఁ దీసికొన నేరఁడయ్యెను. కొందఱు

షెర్పా లతని నాస్థితి లోనే యీ మంచుకొండపై వదలం దలచిరి. ఏల యనఁ బర్వతాధిష్ఠాన దేవత తన బలిని వీరపహరించినయెడల నపహర్తలందు మఱియొకనిని బలి గోరునని వారి మూఢ విశ్వాసము.

టిల్మ నాగ్రహావేశపరవశుఁడయ్యెను. ఆతనినిఁ గ్రిందికిఁ జేర్చుఁడని భారవాహకుల నిర్బంధించెను. కడకు వారట్లే యొనరించిరి. ఈనాటికిని బసాంగు పక్షవాతవ్యాధి బీడితుఁడుగనే యుండెను. డార్జిలింగు వీధులందు మంచుదినిన వ్రేళ్లతోఁ దన భిక్షాపాత్ర పట్టుకొని భిక్షాటనము జేయు చుండును. ఆతడిక పర్వతారోహణయాత్రకే కాక జీవిత యాత్రకుఁ గూడ ననర్హుఁడు. కాని యిట్టి విషాద ఘట్టము లేవియు మన టెన్ సింగును జలింపఁ జేయఁ జాలవయ్యెను. ఏనాఁటికైన నెవరెస్టు శిఖరమును జేరవలెననియే యాతని దృఢసంకల్పము.

కాని వెంటనే యాతని యుద్దేశము నెరవేర దయ్యెను. త్వరలో జరుగ నున్న నెవరెస్టు దండయాత్ర కన్పట్ట దయ్యెను. అయినను హిందూకుష్ పర్వతము లందు 25,264 అడుగుల యెత్తున నున్న 'టిరిచ్ మిర్' అను శిఖరయాత్ర యందు బాల్గొని 20,000 అడుగుల యెత్తు వఱకు బరువు మోయఁ గల్గెను.

టెన్ సింగునకు దండయాత్రాసమయమునఁ గాని డబ్బు కన్నులకగపడదు. అదియు మిగుల స్వల్పవేతనము.

మాసమునకు బదునేడు పౌనులు. ఇది గాక యత్యున్నత ప్రదేశము లందున్నపుడు దినమునకు 4 షి. 6 పెన్నీలు 'మంచు బత్తెము' నిత్తురు. దీనితో నాతఁడు సంవత్సర మంతయు, దండయాత్రలు లేని కాలమును గూడ, గడపవలెను. 1939వ సంవత్సరమున యుద్ధము ప్రారంభము కాఁగనే యెవరెస్టు దండయాత్రలు పూర్తిగ విరమింపఁ బడెను. కాని భగవంతుఁ డెట్లో మన టెన్సింగునకు జీవనోపాధిఁ గల్పించెను.

టెన్సింగు దేశమగు నేపాళమున గూర్ఖా లనఁబడు మఱియొక వీరజాతి గలదు. ఆజాతివారు సంగ్రామనిపుణులు. కాని షెర్పా జాతివారి వృత్తి యుద్ధముకాదు. టెన్సింగు మధ్యేమార్గ మవలంబించెను. హిందూకుష్ యాత్రాసమయమునఁ దాను చిత్రాలులోఁ జూచిన దృశ్యము లాతని నాకర్షించెను. అదికారణముగ నాతఁడు తన నివాసమును జిత్రాలునకు మార్చెను. చిత్రాలు స్కౌటు గ్రూపులో నొకడుగఁ జేరెను. యుద్ధము పరిసమాప్తి యగువఱకు నందే పనిఁజేసెను. పని పూర్తి కాఁగనే మరల డార్జిలింగు జేరి యారోహణకార్యము లందు బాల్గొనఁ బ్రారంభించెను. పర్వతప్రాంతపరిశోధకుల జేరెను.

1947 లో రెండు పర్యాయములు గార్వాలుకు జేయఁబడిన స్విస్ దండయాత్రలలో నాతఁడు బాల్గొని, 23,000 అడుగుల యౌన్నత్యమును జూచి రాఁగల్గెను. 1948 లో నాతఁడు లాసాలో నెనిమిది మాసములుండి టుస్సీకి సహా

చరుఁడై నలుబది మూటల గ్రంథములను మోసెను. 1949లో మరల నతఁడు టిక్ మనుకు సహగామియై నేపాళయాత్ర లందుఁ బాల్గొనెను. ఈ యాత్ర లందా తనికిఁ గొంచెము దృష్టిమాంద్యము సంభవించెను. మఱుసటి సంవత్సరము గార్వాలుకు దిరిగి వచ్చి ఫ్రెంచివారి నందదేవి ఆరోహణ లందుఁ బాల్గొని 25,000-అడుగు లధిరోహింపఁ గల్గెను. తా నొనర్చిన యాత్ర లన్నిటి కంటె నందదేవి యాత్రయే కష్టతమమని యాతఁడు వ్రాక్రుచ్చెను. ఆతఁ డొక పత్రికాప్రతినిధితో 1951లో నిట్లు చెప్పెను—"నందదేవి యారోహణమున హిమానీనదముల దాటుట నాకుఁ జాల కష్ట మయ్యెను. నే నడుగులో నడుగు బెట్టుకొనుచుఁ జీమవలెఁ బ్రాకితిని. పట్టుకొనుట కాధారము లేదు. పాదము మోపుటకు స్థలము లేదు. పై పెచ్చు మంచుపైఁ గాలు జారు చుండెను. యంత్రము పనిచేయక ప్రాణవాయువు ఘనీభవించెను. ప్రాణవాయు పరికరము నచటనే పారవైచి యాఱవ మకామునకుఁ దిరోగమించితిని. అత్యున్నత ప్రదేశముఁ జేరఁగల్గితి మని యందఱము సంతసించితిమి."

"అందుబాటులో నెక్కడను బువ్వము కఱవయ్యెను. తెల్లసాహెబులు 'సాండ్ విచ్ లు' మాలను దమారు చేసి మాకిచ్చిరి. మేము ధరించి యత్యానందమున నృత్య మొనర్చితిమి." టెన్ సిం గిట్లు గొప్ప యాటంకముల దాటి యారోహణ కార్యమున ఘటికుఁ డయ్యెను. ఆతఁడు హిమాలయము

లందలి 'యవలాంచెస్' (హిమశైల పతనములు)ను గూర్చియు, వాతావరణ పరిణామములఁ గూర్చియు గొప్ప విజ్ఞాన మార్జించెను. పటకుటీరస్థల నిర్ణయ మందును, సామానులను, భారవాహకులను సర్దుట యందును నప్రతిమానమగు ననుభవము గడించెను.

అతఁడు యథాపూర్వముగనే చుఱుకుఁదనము గలిగి, వినమ్రుఁడుగ నుండెను. ప్రాయ మిప్పుడు ముప్పదియవ పడి దాటినను నెవరెస్టింకను నజేయముగనే యుండెను. కాన నింకొకసారి యత్నించి చూడ వలెనని యాతఁ డెంచెను. ఈ యభిప్రాయము తోడనే యాతఁడు 1952 లో స్విస్ దండయాత్రయందుఁ బాల్గొనెను. ఈ ప్రయత్నమున నాతఁడు తన శక్తిసామర్థ్యముల నన్నిటిని ధారవోసెను.



# 3

# స్విస్ యాత్రలు

మొదటి స్విస్ దళాధిపతి విస్ డునాంటు. టెన్‌సింగు ప్రసిద్ధి నాతఁడు పూర్తిగ విని యుండెను. ఎల్లరు నీతని సామర్థ్యమును గూర్చి గొప్పగఁ జెప్పిరి. కాని తాను స్వయముగఁ బరీక్షించి, నిర్ణయించు కొనఁ దలఁచెను. 'నీవు భారవాహనాయకుఁడవై, యగ్రగామివై మాకు సహకరింపవలె' నని యాతఁడు కోరెను. టెన్‌సింగు సంతోషమునకు మేర లేదయ్యెను. తన కీవఱకున్న నిషేధము తొలఁగెను. తన యభిమానపర్వతముపై 'దెల్లసాహెబు'లతో షెర్పా భాగస్వామి యయ్యెను. పర్వతారోహణ విషయమున గూడ మార్పులు జనించుచుండెను. ఈవఱకు బ్రిటన్, ఫ్రాన్సు, నార్వే, జర్మనీ, అమెరికా, స్విట్జరులాండుల వారు యాత్రాదళముల నంపుచుండిరి. గాని వారెవరును షెర్పాలకు తమతో సమానప్రతిపత్తి నీయకుండిరి. కాని యీసారి నూతనాచారములు, నవీన సాంప్రదాయములు గన్పట్టెను.

ఈవఱకు బ్రిటిష్ పర్వతారోహకులు షెర్పాల సామర్థ్యమును, ధైర్యసాహసములను బెక్కు తెఱంగులఁ బొగడి యుండిరి. కాని తెల్లవారికిని, నల్లవారికిని మధ్య నొక గోడ యడ్డు గలదు. ఇది రంగు భేదము కాదు. సేవ్యసేవక తారతమ్యము. 'లింగనికిని, రంగనికినిఁ బ్రాణస్నేహమే కాని

రొమ్మున కడ గిజగిజ' యన్నట్లు షెర్పా లెంతటి ధైర్యవంతు లైనను, సాహసోపేతు లైనను దమతో పాటు నారోహక ప్రతిపత్తి కనర్హులు. కాని యీ నూతనారోహకుల యభి ప్రాయ మట్టిది కాదు. ఆల్ప్స పర్వతారోహణమున మార్గ దర్శకులకును, నారోహకులకును మధ్య తారతమ్యము లేదు. హిమాలయములందేల యుండవలెనని వారి యభిప్రాయము.

డాక్టరు విస్‌డునాంటు కీ క్రొత్తగా నియమింపఁబడిన సర్దారుసహచరునిపైఁ బ్రత్యేకాభిమానము గూడ గలదు. ఈ దండయాత్ర నూత్నమార్గమును టెన్‌సింగునకుఁ బ్రథమ శిక్షకుఁడగు పిష్టన్ గనిపెట్టును. ఈపిష్టన్ తోడనే టెన్ సింగు నందదేవి యారోహణమునందుఁ బాల్గొనె నని చెప్పి యుంటిమి గదా! ఈ స్విస్‌యాత్రయందు టెన్‌సింగును, నాతని సహచర షెర్పా లాఱుగురును గొప్ప బరువులతో హిమానీనదముల దాటిరి. స్విస్సు వారంద ఱాశ్చర్యచకితు లైరి. అగుటయే కాక షెర్పాల సేవతో మిగుల దృష్టిఁ గాంచిరి.

హిమవృష్టి తగ్గిన పిమ్మట యాత్రికులను గొప్ప యపాయ మెదుర్కొనెను. 25,260 అడుగుల యెత్తున కేగిన పిమ్మట నిరువురు షెర్పాలు వెనుఁదిరుగ వలసి వచ్చెను. వారి పాదాంగుష్ఠములు మంచు దినిపోయెను. అదికారణముగ వారి భారము మిగిలిన షెర్పాలు పంచుకొన వలసి వచ్చెను. కాని యొక నిదురసంచి (Sleeping bag) మాత్రము మిగిలి

పోయెను. వాతావరణ మింకను బ్రతికూల మయ్యెను. బ్రచండవాయువులు వీవ సాగెను. వారెట్లో రెండు పటకుటీరముల మాత్రము నిర్మింపఁ గల్గిరి.

ఒకదాని యందు నల్వురు షెర్పాలును, మఱియొక దాని యందు ముగ్గురు స్విస్సు వారును దల దాఁచుకొనిరి. యూరోపియనులు కాళ్లు సాఫుగ చాచి పరుండ లేకపోయిరి. మంచులోయ లోనికి దొరలుదు మేమో యని భీతచిత్తులైరి. రాత్రి గాఢాంధకార మావరించెను. శీతవాతములు మిగుల దయావిరహితము లయ్యెను. టెన్‌సింగు టీ త్రాగి మఱియొక షెర్పాకుఁ ద్రాటితో బంధించు కొని వేడి యాహార పానీయములు ముగ్గురు స్విస్ వారికి నందించెను. రాత్రియంతయు దళమువారు గడగడ వడకుచుండిరి. గుడారముల లోనికిఁ జల్లగాలి వీచుచునే యుండెను. ఉదయము ఆరు గంటల వఱకు వారట్లే ప్రాణము లఱచేతఁ బట్టుకొని యుండిరి. అంతట గుడారములు విడచిరి. ముగ్గురు షెర్పాలు శరీరస్వాస్థ్యము గోల్పోయిరి. వా రాహారముఁ గొని తెచ్చుటకై దిగువ కేగిరి. కాని లాంబర్టు చెప్పినట్లు మన టెన్ సింగు ధైర్యమునుఁ గోల్పోక, యేమాత్రమును జలింపక యారోహకుల వెన్ను కాచుకొనియే యుండెను. ఇట్లు వారు 26,250 అడుగుల యెత్తున కేగిరి. ఎవరెస్టున కభిముఖముగ నున్న యొక హిమశిలపై స్విస్ వారు విశ్రాంతిఁ దీసికొను చుండిరి. కాని టెన్‌సిం గస్వస్థతగ నున్న ముగ్గురు షెర్పా

లకును ధైర్యము పురిఁగొల్పి మరల బైకి తోడుకొనివచ్చుటకై క్రింది కేగెను.

వారినిఁ బ్రోత్సహించి యెట్లో పైకిఁ దీసికొని రాఁ గల్గెను. ఝంఝామారుతము మిగులఁ బ్రాణాంతకముగ నుండెను. వారు రాత్రి మకాము నేర్పఱచుకొనుటకై చుట్టు త్రోవను మోకాళ్లపైఁ బ్రాకి పోవలసి వచ్చెను. ఒక షెర్పా యీ బాధ కన్న మరణమే యుత్తమ మని యెంచెను. మఱి యొకఁడు మద్యపానమున వలెఁ దూల సాగెను. ఇంకొకనికి శిరోవేదనచేఁ దల బ్రద్దలగుచుండెను. ఈ ప్రచండ వాతూల మునకు ధీరుఁడగు టెన్‌సింగొక్కఁడు మాత్రము తట్టుకొని నిలఁబడఁ గల్గెను. మఱునాఁడు షెర్పాలందఱు పలాయన మంత్రము పఠించిరి. స్విస్సువారును టెన్‌సింగు మాత్రము పైకిఁ బోసాగిరి.

టెన్‌సింగును, లాంబర్టును నొండొరులు ప్రాటిచే బంధించుకొనిరి. వారిరువురే మార్గదర్శకులైరి. ఇరువురును నొకేవిధమగు మనుష్యులు. ఇరువురకును బర్వతారోహణ తృష్ణ మెండు. లాంబర్టు ఆల్ప్సుపర్వతము లధిరోహించునపు డెట్టి యపాయమునకైన జంకి యెఱుఁగడు. వెనుదిరుగుట యన్న నేమియో యాతని కెఱుక లేదు. టెన్‌సింగును నట్టి వాఁడే. ఆరోహణమునం దిరువురును నందెవేసిన చేతులే. టెన్‌సింగునకు బ్రాణవాయు సాధనము నుపయోగించు విధము మాత్రము లాంబర్టు నేర్పవలసి వచ్చెను. ఈ మిత్రు

లిరువురు నక్లే హిమావృత శిలలపైఁ జచ్చిచెడి పురోగమించు చుండిరి. వారొక కొండవాలును జేరిరి.

అది మిగుల నిట్రముగ నుండి యారోహణ కడు నసాధ్యముగ నుండెను. వారెట్లో దానినిఁ బ్రదక్షిణించి మార్గాంతరమున మెట్లు జెక్కికొనుచుఁ బోవు చుండిరి. కాని యలసట మెండయ్యెను. ప్రాణవాయు పరికరముల కెక్కుడుగ నుపయోగింప వలసి వచ్చెను. ఇరువది నిముసములు గడచిన గాని వారు తెప్పిరిల నేరరైరి. వారచటఁ గొంత తడవు విశ్రమించి దిగువ నున్న నిరువురి కొఱకు నిరీక్షించు చుండిరి. లాంబర్టు దిగువదృశ్యము జూచి యాశ్చర్య చకితుఁ డయ్యెను. టిబెటంతయు నాతని పాదముల క్రింద నున్నట్లుండెను. ఆతఁ డెవరెస్టు తూర్పు పార్శ్వమును జూడఁ గల్గెను. అయ్యది 16,000 అడుగుల దిగువకు కార్తన్లోయ వఱకుఁ గన్పించు చుండెను. ఆర్ద్రీభూతచిత్తుఁడై యాతఁ డొండు రెండు కవోష్ణబాష్పధారలు రాల్చెను.

కాని టెన్సింగు మానసము మాత్ర మాలోచించునే యుండెను. తాను తెచ్చుచున్న పటకుటీర మట స్థాపించెను. ఆనాఁటి కచట విశ్రమించి మఱునాటి వఱువాత మరల బయలు దేరుద మని యాతఁడు హిత వొసఁగెను. లాంబర్టును మోచేతితోఁ బొడిచి శిఖరమును వ్రేలితోఁ జూపుచు 'మన మిరువురమును రేపు దానినిఁ జేరుద'మని సంక్షేపముగఁ బల్కెను. ఇది చాల సాహసకృత్యము. ఏల యన నాఁటి

రాత్రికి వారికి వేఁడిపానీయములఁ గాచుకొనుటకు 'స్టౌ' లేదు. చలి నాపుటకు దుస్తులు లేవు. కాని లాంబర్టు తల నెగుర వైచెను. ఆబర్టు, ఫ్లోరీ యను వారిరువురు క్రింది సౌతుకాలు మకాము నొద్ద కాఁపుదలగ నుండునట్లును, టెన్ సింగు, లాంబర్టులు మఱునాడు పైకిఁ బోవునట్లును నిశ్చయించు కొనిరి.

నాటి రాత్రి మంచులోఁ ద్రవ్వుకొనిన పల్లమే వారికి సెజ్జ. పైన గాలికిఁ దటతట లాడు పటకుటీరము. చుట్టును నెముకలఁ గొఱికి తిను శీతము. ఆహారమా! యంతంత మాత్రము. వారొక మైనపువత్తి వెలిగించి మంచు కఱగించి వేఁడి పానీయ మింత త్రాగిరి. రక్తప్రసరము సరిగ నుండుటకై యొకరి నొకరఱచేతితోఁ జఱచుకొనుచు గిల్లుకొనుచు నా నిశియంతయు వేగించిరి. ఒక్క రాత్రి గడపుట వారి కొక్క యుగ మయ్యెను. ఎట్లో భల్లునఁ దెల్లవారెను. వెలుతురు దృగ్గోచర మయ్యెను. ఉదయము 6 గంటలకు బున రారోహణము ప్రారంభించిరి. వారి యొద్ద మూఁడు ప్రాణవాయు పూరితగోళములు మాత్ర ముండెను. కొలఁది యాహార ముండెను. అడుగులో నడుగు వైచుకొనుచు వారు చీమల వలెఁ బ్రాకి పోవు చుండిరి.

ఇంతలోఁ బొగమంచు దృష్టి కవరోధము గల్గించెను. హిమవృష్టి ప్రారంభ మయ్యెను. మోకాళ్ల వఱకు మంచులో మునిఁగి పోవు చుండిరి. వారు మూఁడేసి యడుగుల కొక

పర్యాయ మూపిరి పీలువ వలసి వచ్చెను. ప్రాణవాయు పరికరము లెడ తెగక యుపయోగింప వలసి వచ్చెను. ఆగినపుడు సింహముల వలెఁ గన్పడు చుండిరి. కాని యడుగు వైచుటయే చిత్రవధగఁ దోచెను. టెన్‌సింగునకు బదములు తొట్రిల సాగెను. శిఖర మింకను 700 అడుగుల యెత్తున నుండెను. వారపజయ మంగీకరింప వలసి వచ్చెను. తమకొఱకు ఆబట్టు, ఫ్లోరీలు నిరీక్షించు చున్న సౌతుకాలు మకామునకుఁ దిరోగమించుట దప్ప గత్యంతరము లేదని నిశ్చయించు కొనిరి.

కాని యీ యపజయముతోనంతయు నంతముకాలేదు. ఋతుపవనములు తగ్గిన పిమ్మట వసంతఋతువు నందు వారు మరలఁ బయనము సాగింప నెంచిరి. ద్వితీయయాత్రకు సన్నాహము లొనర్పఁ దలఁచిరి. ప్రథమ యత్నము జరుగ కుండిననే బాగుండెడిది. ఏల యన నింత నష్ట మెప్పుడును సంభవించి యుండ లేదు. ఒక షెర్పా మంచులో మునిఁగిపోయి మరణించెను. మఱియొకఁడు జారిపడి చనిపోయెను. ముగ్గురికిఁ గాయములు గాయము లయ్యెను. ఇంకొకనికి మెడపై శస్త్రచికిత్స జేయవలసి వచ్చెను. ఇట్టి యపాయకరయాత్ర ముగిసెను.

టెన్‌సిం గిప్పటి కాఱు పర్యాయములు హిమాలయములపైఁ దన శక్తిసామర్థ్యములను, శారీరకమనోదార్ఢ్యములను ధారవోసెను. శిఖరము మాత్రము హస్తగతము గాదయ్యెను. ఇంక నెప్పటికైన నెవరెస్టు శిఖరముపైఁ గల పర్వతాధిష్ఠాన

దేవతకు భక్తిపూర్వకముగ సాష్టాంగ మెఱఁగి తన యొద్ద
నుండు నల్పాహారము నివేదన యొనర్పఁ గలఁడా!



# 4

# విజయ యాత్ర

టెన్‌సింగు నార్కే యీ యాఱు మాసములలో నెవరెస్టుపై రెండు దండయాత్ర లొనర్చెను. లాంబర్టుతోఁ గూడ నీ రెండు యాత్రలందు నపజయము గాంచెను. అపజయము మాట యట్లుండ నారోగ్యము శిథిలమై మలేరియా జ్వర మంటుకొనెను.

ఒకనాఁడు డార్జిలింగు పట్టణమునఁ దన గదిలో జ్వరముతో మూల్గుచు నొంటరిగ బరుండి యుండెను. నేపాలు ప్రభుత్వ మిటీవల నొసఁగిన పతకము చేతికిఁ దాకెను. గత దండయాత్ర యందు దాదాపు శిఖరము వఱకుఁ బోఁగలిగి నందుల కీ పతక మొసఁగఁ బడెను. పతక స్పర్శవలన మరల నొకపతి యెవరెస్టు స్పృహకుఁ దగిలెను. కాని వెంటనే నిరాశాపూరితుఁ డయ్యెను. వ్యాధి కారణమున సంపాదన యుడిగి ధనాభావము మెండయ్యెను. డార్జిలింగు నందలి నేపాలీ బాలికాపాఠశాల యందుఁ బుత్రిక లిద్వరు విద్యాభ్యాస మొనర్చు చుండిరి గదా! వారి జీతమునకుఁ గూడ ధనము కఱవై పశ్చిమబెంగాలు ప్రభుత్వమును ఋణ మడుగ వలసి వచ్చెను.

ఈ సమయమున నాల్పైన్ సంఘము వారు షెర్పా యైన తనను నారోహకదళసభ్యునిగఁ జేరు మని వార్త

నంపిరి. పూర్వ పరిచితుఁడగు లాంబర్టు, స్విట్జరు లాండునకు రమ్మని యప్పుడే కబు రంపెను. 'ప్రపంచమందలి పర్వతారోహకుల కందఱ కిప్పుడు నీ నామము పరిచిత మయ్యెఁ గాన నీ వైరోపాకు వచ్చిన యెడల ఘనస్వాగత మీయఁ బడు' నని యాతఁడు వ్రాసెను. అదే సమయమున 'నేపాలునకు మార్చి మాసములో రానున్న బ్రిటిష్ యాత్రా దళమందుఁ జేరుటకు వీలుండునా?' యని లండను నుండి కబురువచ్చెను.

దీనితో టెన్ సింగు జ్వరము మటుమాయ మయ్యెను. ఎప్పటి శరీరబలము చేకూరి నట్లయ్యెను. వెంటనే శరీరమును మరల నారోహణ కనువగు నట్లొనర్చుటకై పరిసరపర్వత ప్రాంతముల కేగెను. అచిరకాలమునఁ బూర్వారోగ్యముఁ బడయఁ జాలెను.

కర్నలు హంటును బ్రథమముగ ఖట్మండులోఁ గలిసి కొనెను. హిమాలయన్ క్లబ్బు వా రాతనిప్రయాణమున కేర్పా టొనరించిరి. బ్రిటిష్ విజ్ఞానశాస్త్రవేత్తలును, వస్తు నిర్మాతలును, మానవశక్తికి సాధ్యములగు సన్నాహము లన్నియు గావించిరి. ఈ వఱకు జరిగిన నే దండయాత్రకును నిట్టి సమగ్రసన్నాహములు జరిగియుండ లేదు. కడచిన వత్సరము జరిగిన స్విస్ దండయాత్రకుఁ గూడ నిట్టి పరిపూర్ణ సన్నాహము లొనర్పఁ బడి యుండలేదు.

ఇప్పుడు పెనుగాలియు విపరీతవాతావరణము దక్క నెవరెస్టునకు మఱియొక దిక్కు లేదు. ఈ ప్రయాణసామగ్రి

యంతయు 350 మూటలయ్యెను. భారవాహకదళ మొకటి సిద్ధపరుపఁ బడెను. వారు రెండు జట్లుగ విభజింపఁ బడిరి. ఆరోహకు లందు హంటు, హిల్లరీ, టెన్‌సింగు, బౌర్డిలాన్, ఇవాన్సు మున్నగు వారు ముఖ్యులు. వీరిలో నిద్దఱేసి యొక్కొక్క జట్టుగా విడివడిరి. ఒక జట్టారోహణ కార్యమందు నిమగ్నమై యుండ, మఱియొక జట్టు వెనుక కాఁపుఁ దలగ నుండు నట్లేర్పాటు గావించుకొనిరి.

ఆ దినమంతయు టెన్‌సింగునకు దీరిక లేదు. 'ఎవరెస్టు శిఖరము కడ నెట్లుండు' నని పరిచయులు ప్రశ్నింపసాగిరి. అతఁ డమాయకముగ 'నేనుమ్మి వైచిననది ఘనీభవించి శిలారూపమునఁ గ్రిందఁ బడెను. నా నిశ్వాసము గడ్డకట్టి వెంట్రుకల కంటుకొనె' నని స్పష్టీకరించెను. "నీవారోహకులలో నొకఁడవుగ నుండి, షెర్పాలపై యాజమాన్యము వహించి వారికిఁ బ్రాణవాయు పరికరముల నుపయోగించు విధము మున్నగునవి కఱపు చుండ వలెను. పర్వతముపై నొంటరిగఁ బోవలసిన సమయ మాసన్నమైనపు డొంటరిగఁ బోవచ్చు" నని హంటుచెప్పెను. ఇల్లు వదలివచ్చిన పదునెనిమిది సంవత్సరములకాతఁడు భారవాహకపదవి నుండి యారోహక పదవిఁ గాంచెను. తన యద్భుత విజయ కారణమునఁ బ్రపంచమును విస్మయసముద్రమున ముంచఁ గల్గెను. ఈవఱకే దండయాత్ర యందును నారోహకులకుఁ గాని, భారవాహకులకుఁ గాని యిట్టి శిక్షణ యొసఁగఁ బడదయ్యెను.

దళనాయకుఁడగు హంటు దళ విభజన మొనరించి యొక్కొక్క జట్టున కొక్కొక్క విధి నప్పగించెను. టెన్ సింగును హిల్లరీతో జత యొనర్చెను. ఇది సరియగు నుద్ది.

హిల్లరీ న్యూజిలాండు వాస్తవ్యుఁడు. తాను పర్వతములపై నున్నపు డపాయము మాటయే తనకు స్ఫురణకు రాదని యాతఁడు చెప్పుచుండును. తన మనమంతయు నారోహణ కృత్యము నందే నిమగ్నమై యుండు ననియు, నితర ప్రపంచమును మరతు ననియు జెప్పెను. టెన్ సింగు కూడ నట్టి వాఁడే. హిల్లరీ స్నేహ పాత్రుఁడు. టెన్ సింగు సరళ హృదయుఁడు. ఇఁక మైత్రికి లోటేమి? హిల్లరీయందు బెట్టుసరిగాని, యొంటరి తనము గాని కన్పట్టనే కన్పట్టదు. ఆరోహణకృత్యమున టెన్ సింగున కింత కంటె నర్హుఁడగు మిత్రుఁడు దొరకఁడు. కాన బంగారమునకు వెలిగారము హత్తినట్లు వారిరువురిసాహచర్యము మిగుల శ్లాఘాపాత్రముగ నుండెను.

జట్టువా రనేక కష్టనిష్ఠురములకు లోనై యైదవ మకామును జేరిరి. ఝంఝామారుతము వీవ సాగెను. భావిస్థితి యంధకార బంధుర మయ్యెను. అట్లే వా రేడవ మకామును జేరిరి. జార్డిలా నను నతఁడచటికి ముందే చేరి తక్కుఁగల వారి రాకకై నిరీక్షించు చుండెను. మూలశిబిరము నుండియే పొడఁగాంచఁ గల్గిన 'పుమోరి' శిఖరమును వారు కన్నులపండువుగఁ గాంచఁ గల్గిరి. అప్పటికి వారు 25, 000

అడుగులయెత్తునకు మాత్రము బోఁగల్గిరి. తరువాతి మకాముగు సౌతుకాలునకుఁ బోవుట వారికంత యుత్సాహ జనకముగ లేకుండెను. ఆరాత్రి యంతయు ప్రాణవాయు పరికరముల నుపయోగించుచు వారక్లే కడపిరి.

మరల మరునాడుదయము 8-30 గంటలకు వారు పయనము సాగించిరి. ఆనాఁడును గడచిన దినము వలెనే వారు రెండు త్రాళ్ల సహాయమున నారోహణ సాగించిరి. హంటు జట్టులో నిరువురు షెర్పా లుండిరి. వా రిరువురకును ప్రాణవాయుపరికరములు లేవు. కాన వారి గమనము మిగుల మందముగ నుండెను. బౌర్డిలాన్, ఇవాన్సులకుఁ బరికరము లున్నను వారి గమనము కూడ నేమంత శీఘ్రముగ లేకుం డెను. కడచిన రెండు దినముల నుండియు వీచిన వాయువు లచే మంచు ఘనీభవించి మార్గమేర్పఱచు కొనుటయే కష్ట తరముగ నుండెను. జట్టువారు మిగుల డస్సిరి. పూర్వ పరి చితములగు నాయున్నత ప్రదేశములం దక్లే వారు గంటల కొలఁది కాలము వ్యయించిరి. సాయంతనము నాలుగగు నప్ప టికి షెర్పాలు పూర్తిగ నలసి పోయిరి. హంటు ప్రాణ పరికరము పట్టిపోయెను. అప్పటికి వారు 'ఎపకాండస్ జెని వాయిన్' అను ప్రదేశమునుఁ జేరఁ గల్గిరి. అట నుండి వారు పైనున్న నెవరెస్టు వైపున కొకసారియు, క్రింద నున్న సౌతుకాలువైపున కింకొకసారియు దృష్టి సాగించిరి. రెంటిలో నేదియు ప్రోత్సాహజనకముగఁ గన్పట్ట దయ్యెను. కడచిన

మార్గము కన్న రాంబోవు మార్గమే వారికి కఠినతరముగఁ గాన్పించెను.

పడమటిగాలి మిగుల భయంకరముగ వీచు చుండెను. ఒకచో వారు స్విస్సువారి పటకుటీర చిహ్నములఁ గాంచి మిగుల భయకంపితు లైరి. ప్రచండవాయువుతో వారొక గంటసేపు హోరా హోరిగఁ బోరి యా రాత్రికి రెండు గుడారముల మాత్రము నిర్మింపఁ గల్గిరి. వెంట వెంటనే వేఁడి పానీయములు త్రాగిన కతమున వారికి మరలఁ గొంత పురి వచ్చెను. దారి నిట్రముగ నుంటచే మఱునాఁటి యుదయ మున వారు చుట్టు త్రోవనుఁ బయనింప నెంచిరి. జట్టు నందలి ప్రతివారును డస్సి యొక్క యడుగైన ముందునకుఁ బెట్టఁ జాల రైరి. అదికతముగ నింకొక యిరువదినాలుగు గంట లా పెను గాలి లోనే విశ్రాంతిఁ గైకొన నెంచిరి.

మే 26వ తేదీన వాతావరణ మించుక శాంతించెను. ఆనాఁడంతయు వారు విశ్రమించి మఱునాఁడు పయనమునకు సిద్ధమైరి. బౌర్డిలాన్, ఇవాన్సుల ప్రాణవాయు పరికరములు శిథిలము లయ్యెను. హంటు, దానంజయిలులు మాత్రము ప్రయాణమునకు సిద్ధముగ నుండిరి. కాని వారు స్వయముగ గుడారములు, నాహారము, వంటచెఱకు మున్నగు నవి మోసి కొని పోవలసి వచ్చెను. వీనికిఁ దోడు ప్రాణవాయుపరికరము లొక తగులాట మయ్యెను. మొదట వీ రిరువురు మాత్రము ప్రయాణము సాగించిరి. కాని యొక యరగంట పిమ్మట

బౌర్డిలాన్, ఇవాన్సులు గూడ బయలుదేరిరి. వీరినిఁ జూచి మొదటి జట్టువారి యుత్సాహ మినుమ డించెను. రెండవ జట్టు వారే మొదటి జట్టు వారిని మిగిలి పోయిరి. దానం జయిలు, హంటులు మిగుల నెమ్మదిగఁ బోవు చుండిరి. ఏల యన హంటు ప్రాణవాయు పరికరము మంచు పేరుకొని పనిఁ జేయ దయ్యెను. ఈ పరిస్థితు లందు హంటునకుఁ బ్రతి యడుగును బ్రాణాంతక మయ్యెను. తుద కెట్లో వారు వాయవ్య పార్శ్వమును జేరిరి.

అట లాంబర్టు పటకుటీర చిహ్నములు పొడఁగట్టెను. హంటచట కొలఁది కాలము విశ్రాంతి గైకొనెను. ఇప్పటికి 28,000 అడుగులు వచ్చిరి. 'పోఁగఁ బోఁగఁ బైగుడ్డయే బరు వగు'నన్నట్లువారికి సామానులభారము మిక్కుటమయ్యెను. కొంత భారము తగ్గించుకొన నెంచి కొన్ని సామానులను వెనుక వచ్చుచున్న టెన్‌సింగు, హిల్లరీల యుపయోగార్థ మచటనే వదలి వైచిరి. హంటు, ఇవాన్సు, బౌర్డిలానులవంక జూచెను. వారల్లే యాయాస పడుచు వంగి వంగి యేగు చుండిరి. కాని యింతలోవారిని మేఘపంక్తి కప్పి వైచెను. వాయువు తీవ్రతర మయ్యెను. మేఘములు దట్టమయ్యెను. హిమవృష్టి కురియుచునే యుండెను. హంటుజట్టు తమ ప్రాణవాయు పరికరములఁ గూడ టెన్‌సింగు, హిల్లరీల కొఱ కచటనే వదలి వైచి పరికర రహితులై పయనము సాగించు చుండిరి. వారిరువురును గడు బడలిరి. వారికిఁ దిరోగమనము

తప్ప గత్యంతరము లేదయ్యెను. వారు దిగి వచ్చుచు టెన్ సింగు, హిల్లరీలను గలిసి కొనిరి. 1-30 గంటలకు వారు హంటు, డాంజియనులను గుడారమునఁ జేర వైచి తాము పురోగమించిరి.

కతిపయకాలమునకు గుడారమున నున్నవారికి బౌర్డి లాన్, ఇవాన్సు లెవరెస్టు దక్షిణ శిఖరముపై నున్నట్లు పొడఁ గట్టిరి. షెర్పా లదియే గమ్యస్థాన మనియు దాని నాజట్టు వారు జేరఁ గల్గిరనియు నత్యానంద భరితు లైరి. 3-30 గంట లగు నప్పటికి వారింకను పైకిఁ బోవుచున్నట్లు గన్ప డెను. అంతట మొత్తము పర్వతపంక్తి మేఘావృతమై మానిసికి మానిసి గన్పడ కుండెను. మరలఁ బెనుగాలి విజృంభించెను. 6-30 యగునప్పటికి వారు వెనుఁదిరిగి వచ్చి యెవరెస్టు దక్షిణ శిఖరమును మెట్టితి మని హంటునకు జెప్పిరి.

ఎవరెస్టు నత్యున్నత శిఖర మింకను నజేయముగనే యుండెను. వారు క్రింది మకాముకు వచ్చి ప్రాణవాయు పరికరములఁ గైకొని, వాతావరణ మనుకూలముగ నున్న పక్షమున మరలఁ బయనము సాగింప నెంచిరి, కాని 'తానొకటి దలఁచిన దైవమింకొకటి తలఁచును' గదా! ప్రకృతి యావంతయు జాలిఁ గొన దయ్యెను. తత్ఫలితముగ వారా ప్రయత్నమును విరమింప వలసిన వారైరి. ఏది యెట్లున్నను వారు సౌతుకాలునుండి యెవరెస్టు దక్షిణ శిఖరమున కొనర్చిన ప్రయాణము మిగుల శ్లాఘాపాత్రము. ఇదియే తుది

విజయమునకు మార్గదర్శక మయ్యెను.

ఎవరెస్టు శృంగమును 400 అడుగుల దూరమున నున్న దనగా నారోహకుల కడగండ్లు ప్రారంభ మయ్యెను. అంగుళములో నెనిమిదవ వంతు మందమున మంచు పేరుకొని మాటి మాటికిని గాలు జారుచుండెను. కాలు ఘాత్రిగ జారెనా యథాలోకమున కేగవలసినదే. అడుగు దీసి యడుగు పెట్టుటయే బ్రహ్మ ప్రళయమయ్యెను. కాని వా రించుకయుఁ జలింప రైరి. పయనము నెట్లో సాగించుచునే యుండిరి. ఒక్కఁడు మెట్టు చెక్కికొని పోవుచుండ మఱియొకఁడు వెనుకకుఁ జారకుండ త్రాటితోఁ గట్టిగఁ బట్టుకొను చుండెను. అంతట నారోహకులు మిగుల నపాయకరమగు 'సర్కసు ఫీటు' నొనర్ప వలసి వచ్చెను. నలుబది యడుగుల వెడల్పు గల మంచుకయ్యను దాట వలసిన వారైరి.

ఈకయ్యను దాటిన విధమును హిల్లరీ లండను పట్టణమున వివరించుచుండఁ బ్రేక్షకు లాశ్చర్య భయాధీన మనస్కులై మిగుల నాతురముతో వినిరి. టెన్‌సింగును, హిల్లరీయు నీ 'ఫీటును' (సాహసకార్యమును) 29,000 అడుగుల యెత్తున సల్పిరి. ఆ సమయమున నొక్కొక్కరి భుజముపై 30 పౌనుల బరువు కూడ నుండెను. ముఖములు ప్రాణవాయు పరికరములచే నాచ్ఛాదితములై యుండెను.

ఈగండము గడచినది కాని చేయవలసిన దింకయుఁ గలదు. ఇప్పటికి శిఖరము హస్తగత మయ్యెనని వా రెంచిరి.

టెన్‌సిం గిట్లు చెప్పెను – 'తుదకు మేము జయింపఁ గల్గితిమి. ఎవరెస్టు శంక్వాకారమున విశాలముగ, విహరణయోగ్యముగ నుండెను. శిఖరముపై నానాఁ, డనగా మే 29వ తేదీన, గాలి వేగ మిరువది మైళ్ల కంటె నెక్కుడుగ లేదు. అయినను మందములగు మాదుస్తుల కతమున నది మమ్ము స్పృశింప లేక పోయెను.'

టెన్‌సింగు ముందుగ శంకువు యొక్క యుత్తరఁపుఁ జివర కేగెను. మున్నొకప్పుడు ప్రపంచ సంగ్రామమునకుఁ బూర్వము తా మేర్పఱచిన మకాముల వంక క్రిందికిఁ జూచెను. పూర్వయాత్రా చిహ్నము లనేకము తన మనమునఁ బొడఁ గట్ట నాతఁ డమందానంద భరితుఁ డయ్యెను. వేలకొలఁది యడుగుల క్రింద నాతని కొక చిన్న మచ్చ వంటిది గోచర మయ్యెను. అదియే రాంబక్ మఠము. ఇయ్యది టెన్‌సింగు నకు మిగులఁ బవిత్ర మైనది. ఏల యన నాతఁ డచటి టిబెట్ బౌద్ధ భిక్షువునకుఁ గడుఁగూర్చిన శిష్యుఁడు. తానొక గొప్ప లామాకు మేనల్లుఁడు. తన సోదరి నొక లామాకిచ్చి వివాహ మొనర్చెను.

ఎవరెస్టు శిఖరముపై నొక పర్వతాధిష్ఠాన దేవత కల దని యాతని దృఢవిశ్వాసము. శిఖరముఁ జేరిన వెంటనే యీ విషయ మాతని స్పృహకుఁ దగిలెను. తత్క్షణము కృతజ్ఞతా సూచకముగ నాపె కేమైన నుపహార మిడుట శ్రేయమని యాతఁ డెంచెను. పాదఘట్టనమున మంచుపై నొక పల్లము

గావించెను. తన యొద్దఁ గల కొలఁది మిఠాయియు, బిస్కతులు నాపల్లమున నునిచి, వినయ వినమితగాత్రుఁడై నివేదన యొనరించి, భక్తిపూర్వకముగ సాష్టాంగ మెఱఁగెను. పిమ్మట భారత, నేపాల పతాకములనచటఁ బ్రతిష్ఠాపన మొనరించెను.

శిఖరముఁ జేరిన పిమ్మట నాతనికిఁ గ్రిందికిఁ జేర వలెనను నాతురము మెండయ్యెను. కాని యారోహణము కంటె నవరోహణమే కష్టతరము. దీనికిఁ దోడు ప్రాణ వాయువు కూడ మిగుల స్వల్పముగ నుండెను. టెన్ సింగు, హిల్లరీ లవరోహణ ప్రారంభించిరి.

ఈ విజయవార్త మేరీరాణి పట్టాభిషేక దినమునఁ బ్రపంచమున కందెను. నిస్తంత్రీ విధానమూలమున నొక్క క్షణకాలమునఁ బ్రపంచమంతయు వ్యాపించెను. టెన్ సింగు జగదేకవీరుఁ డయ్యెను. క్రింది లోయలకు వచ్చుటయే తడవుగ జనులు తండోపతండములుగ నాతనిఁ జుట్టును మూఁగి యనేక ప్రశ్న లడుగఁ జొచ్చిరి.

ఈ విజయముతో టెన్ సింగునకు మంచిదినములు వచ్చెను. ఆతని నిరుపేదతన మంతయు మటుమాయ మయ్యెను. దాతలు విరాళమూలమున ధనము సేకరించి యొక గృహమును నిలిచి యాతని కీఁదలఁచిరి. కుమార్తెల విద్యాభ్యాసమున కింక ఋణము కొఱకుఁ బ్రభుత్వమును జేఁజాచి యాచించ నవసరము లేదు. వారి పాఠశాల విద్యయే కాక కళాశాల విద్యకుఁ గూడఁ బశ్చిమ బెంగాలు ప్రభుత్వమే

బాధ్యత వహించెను. డార్జిలింగు నందలి పర్వతారోహక సంఘమునకు డైరెక్టరుగ నాతఁడున్నతోద్యోగమును స్వీకరించెను. పర్వతప్రాంతము లందాలు ఉచిత భోజనశాలలను (Hostels) ప్రభుత్వము స్థాపింప నెంచెను. వాని యందు టెన్సిం గితర షెర్పాల కారోహణ విద్యయందు శిక్షణ నొసఁగును.

ఎవరెస్టు విజయముతో నీ పర్వతారోహణ యాత్ర సమాప్తము గాలేదు. ఇంకను క్రొత్త మార్గముల దానినిఁ జేరవలెనని యారోహకులు తలఁచుచుండిరి. కొందఱు కాంచనగంగను గాంచిరావలెనని తహతహలాడుచుండిరి. ఇంకను హిమాలయములందు మనిజుఁడడుగిడి యెఱుంగని శిఖరము లరువది దాకఁ గలవు. షెర్పాల కింకను గావలసినంత పని గలదు. వారు తప్పక పాల్గొందురు. వారికి భారవాహకపదవి పోయి పర్వతారోహకులతో సమానప్రతిపత్తి యొసఁగఁ బడినది. క్రమక్రమముగ జాతిభేద మంతరించి సర్వసమానత్వ మేర్పడు చున్నది. టెన్సింగు దృష్టాంత మీ విషయమునఁ జాల నుపకరించె నని చెప్ప వచ్చును.

— ♦ —

# 5

# అఖండ స్వాగతము

ఎవరెస్టు విజేత లగు కర్నలుహంటు, హిల్లరీ, టెన్ సింగులకు ప్రపంచము నలుమూలల నుండియు నభినందనములు కుప్ప తిప్పలుగ వర్షించెను. హిమాలయ పాదమునఁ గల బనేపాను జేరుటతో వారి విజయయాత్ర ముగిసెను. ఈ జట్టువారు బనేపానుండి ఖట్మండు జేరిరి. త్రోవ యంతయుఁ దోరణాలంకృత మయ్యెను. దారిపొడుగునను వారి దర్శనమునకై జనులిసుకవైచిన రాలకుండ గుమిఁగూడిరి. వారిపై విజయసూచకముగ సిందూరమును, బుష్పములను వెదఁజల్లిరి.

నేపాలరాజగు త్రిభువన్ టెన్ సింగునకు 'నేపాల తార' పతకమును బహూకరించెను. కర్నలు హంటుకు 'గూర్ఖా దక్షిణబాహు' పతక మొసఁగెను. నేపాలు ప్రభుత్వము జట్టువారి కధికారరీతిని ఘనస్వాగత మిడిరి. అటనుండి వారు దూలాఘాటున కేగిరి. అచటను ప్రజ లఖండ సన్మానమొసఁగి తమ హర్షామోదముల వెలిబుచ్చిరి. అచటనుండి యాత్రాదళమువారు భరతఖండరాజధాని యగు ఢిల్లీ జేరిరి. ఢిల్లీ పురపాలక సంఘమువారు వారికఖండస్వాగత మిచ్చిరి. రజత వికారములగు నశోకస్తంభమును, నెవరెస్టు శిఖరమును బహూకరించిరి.

రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు తన భవనమున నెవరెస్టు



రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌గారు షెర్పా టెన్‌సింగ్ నార్కేను అభినందించుట

విజేతలకు ప్రత్యేకపు విందు నేర్పాటు జేసెను. యాత్రాదళ సభ్యులలో ముఖ్యులగు టెన్‌సింగు, హిల్లరీ, హంటులకు సువర్ణ పతకములు బహూకరించెను. ఈ పతకముల కొక ప్రక్క నెవరెస్టు శిఖరమును, రెండవప్రక్క 'ధీరులకు జయమగుఁ గాక' యను నక్షరపంక్తియుఁ జెక్కఁబడి యుండెను. రాష్ట్రపతి వారి ధైర్యోత్సాహములను, త్యాగసాహసములను మిగులఁ గొనియాడెను. ఢిల్లీ పౌరులు టెన్‌సింగు దంపతులను ప్రత్యేకముగ గౌరవించిరి. టెన్‌సింగు, హిల్లరీ,



రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌గారు ఎవరెస్ట్ విజేతలను
సన్మానించిన దృశ్యము

హంటులు దమ కొసఁగఁ బడిన సన్మానముల కుచితరీతినిఁ బ్రత్యుత్తర మిచ్చి, తమ కృతజ్ఞతను హృదయపూర్వకముగ వెలిబుచ్చిరి.

ఇండియా ప్రభుత్వ విద్యాశాఖ పక్షమున మౌలానా అబుల్ కలాం అజాద్ వారి సాహసకృత్యమును మిగుల శ్లాఘించి టెన్‌సింగునకు బ్రత్యేకముగ నొక రజత దండమును బహూకరించెను. దానిపై 'బ్రపంచములోని కెల్ల నత్యున్నతమగు శిఖరమును జయించిన వీరుఁ' డని చెక్కఁబడి యుండెను.

భారత ప్రధానియగు పండిట్ నెహ్రూ జట్టువారికిఁ దనభవనమున గొప్ప విందొనరించెను. అతిథుల మువ్వుర



భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు
షెర్పా టెన్‌సింగ్ నార్కే కుటుంబముతో

కఖండసత్కార మొసఁగెను. నెహ్రూపండితుఁ డెవరెస్టు విజేత యగు టెన్‌సింగు విషయమునఁ ప్రత్యేకమగు శ్రద్ధ గైకొనెను. పలురకములగు భారతీయవస్తులనే కాక విదేశీయ దుస్తులను గూడ నాతనికి స్వయముగ బహూకరించెను. బ్రిటనుకు బయనమగుచున్న టెన్‌సింగు కుటుంబవిషయమునఁ బ్రత్యేకమగు శ్రద్ధఁ గైకొను మని లండను నందలి ఇండియా రాయబారికిఁ గబురంపెను. ఆయన విదేశయాత్ర కవసర మగు వసతు లన్నియుఁ గల్పింపుఁ డని హెచ్చరించెను.

రాష్ట్రపతి కార్యదర్శి ఇండియాలోఁ బలు ప్రాంతముల నుండి వచ్చిన కానుకలు టెన్‌సింగున కర్పించెను. ఇందు రెండు వేలపై చిలుకు రొక్కమును, నొకపతకమును, పెన్సిలుతో

వ్రాయఁబడిన నాతని చిత్రమును, నొక యెలెక్ట్రిక్ స్టౌవును గూడ గలవు. పూనా యందలి బంగారువర్తకుఁ డొకఁడు పావుతులము బంగారము బహూకృతిగ నంపెను. ఇట్లాతనికి బొంబాయి, బీహారు, హిమాచలప్రదేశ్, హైదరాబాదు, అస్సాము, చెన్నరాష్ట్రము మున్నగు పలుప్రాంతముల నుండి కానుక లంపఁబడెను. ప్రేమ పురస్సరముగఁ దనకుఁ గానుక లంపిన నీ బహుమానప్రదాత లందఱకు టెన్‌సింగు తన హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములఁ దెలియఁబఱచెను.

ఇట్లు ఢిల్లీ పట్టణమున నాల్గు దినము లుండి జట్టువారు బ్రిటనుకుఁ బయన మైరి. ఢిల్లీ పౌరులు విమానాశ్రయము నొద్ద వేనకువేలు జేరి వారికి గొప్ప వీడ్కో లొసంగిరి.

మార్గమధ్యమునఁ గరాచి మున్నగు ముఖ్యపట్టణము లందు వారికిఁ బ్రజలు ఘనస్వాగత మిడిరి. ఎచటి కేగినను నెవరెస్టు విజేతల చుట్టును జనులు గుంపులు గుంపులుగఁ జేరి వారి యామోదమును వెలిబుచ్చి వేనోళ్లఁ బొగడిరి. ఎవరెస్టు యాత్రను గూర్చి ప్రశ్నలవర్షము గురిపించిరి. వారు విసుగు గొనక నందఱకు నుచితరీతి సమాధానము లిచ్చి, తమ యాత్రానుభవముల గూర్చి తేటతెల్లముగ వివరించిరి.

లండను పట్టణమున వారి కొసఁగఁబడిన స్వాగతము వర్ణనాతీతము. ఆరోహణానుభవము గల వీరులే కాక ప్రజ లాబాలగోపాలము వారిని జుట్టుముట్టి వారి సాహసకృత్య మును వేనోళ్లఁ బొగడిరి. పత్రికా ప్రతినిధు లనేకులు వారిని

సమీపించి వివిధములగు విషయములఁ గూర్చి వారినిఁ బ్రశ్నించిరి. తమ్మెదుర్కొనిన నపాయముల గుఱించియు, బర్వతపంక్తులందలి వాతావరణ పరిణామముల గురించియు దమ స్వానుభవములను వారు విపులముగ వివరించిరి. వారి యనుభవ సారాంశ మిద్ది:—'వాతావరణ మనుకూలమై యుండెను. ఉత్తమప్రాణవాయు యంత్రములు మాకడ నుండెను. తగిన సమయమును గుర్తించి ప్రయత్న మొనర్చుట మా విజయమునకు బ్రధానకారణము. నిరుడు స్విస్ జట్టెవరెస్టు నెక్కినపుడు వర్ష కాలము. జట్టు సభ్యులలో నుత్సాహము, సహకారభావము తక్కువ. చేఁజిక్కిన సమయమును సవ్యముగ నుపయోగించుకొను వీలు జిక్క దయ్యెను. తుదిఘట్టమునఁ బ్రాణవాయు పరికరములు మాకు మిగులఁ దోడ్పడెను. అన్నిఁటికన్న మిన్నగ మా పరస్పర సహకారభావము విజయ కారణ మయ్యెను.'

టెన్‌సింగు తన సమాధానము లన్నియు నాంగ్లేయ భాష లోనే యొసఁగెను. ఒక్కచోఁ దనచుట్టును దట్టముగఁ గ్రిక్కిరిసి యున్న జనసమూహమును జూచి 'ఎవరెస్టు మీఁదికైనను మార్గము సులువుగ లభ్యమయ్యెను గాని యీ ప్రజా సముద్రమును దఱించు మార్గ మగుపడుట లే'దని మిగులఁ జమత్కారముగ నుడివెను.

ఎలిజబెత్ మహారాజ్ఞి టెన్‌సింగునకు జార్జిపతకమును బహూకరించెను. హంటు, హిల్లరీలకు బిరుద ప్రదాన మొన

ర్చెను. జార్జిపతకము గొప్ప క్లిష్టసమయములందు మిగుల ధైర్యసాహసములఁ బ్రదర్శించిన వారికిఁ గాని యొసగఁబడదు. దీనిని 1940 వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁడగు నైదవజార్జి చక్రవర్తి స్థాపించెను. రజత వికారమగు నీ పతకమున కొక ప్రక్కఁ గిరీటధారియగు నైదవజార్జి ప్రతిమ యుండును. మఱి యొక ప్రక్క దుష్టమృగ సంహార మొనర్చు సెంటుజార్జి ప్రతిమ ముద్రించియుండును. ఇందొక ప్రక్క జి. యమ్. అను పొడియక్షరములు ముద్రితములై యుండును. నీలవర్ణ ములగు నైదు చారలు గల యెఱ్ఱని రిబ్బనుతో దీనినఁ దగి లింతురు. రవియస్తమింపని సామ్రాజ్యాధినేత్రి యగు నెలిజ బెత్ మహారాజ్ఞిచే నిట్టి పతకమును బడయఁ గల్గిన జెన్ సింగు నదృష్టము సామాన్యమే!





# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IPLA 109B186 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 84 6,8,42 |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |